శ్రీః

శ్రీదూర్వాసోమహామునివిరచితమ్

# స్వయంవరకళాస్తోత్రమ్

ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ: డా॥ నిష్ఠల సుబ్రహ్మణ్యం



ప్రకాశకులు

**శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము**

చిల్లకల్లు - 521 178,

జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.

శ్రీః

శ్రీదూర్వాసోమహామునివిరచితమ్

# స్వయంవర కళాస్తోత్రమ్

ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ: డా॥ నిష్ఠల సుబ్రహ్మణ్యం



ప్రకాశకులు

**శ్రీ సదాశివ బ్రహ్మేంద్రాశ్రమము**

చిల్లకల్లు - 521 178,

జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.

శ్రీః

శ్రీదూర్వాసోమహామునివిరచితమ్

# స్వయంవరకళాస్తోత్రమ్

ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ

**డా॥ నిష్ఠల సుబ్రహ్మణ్యం**

ప్రథమముద్రణ :- 30.04.2009

| | | |
|---|---|---|
| ప్రతులు | : | 1000 |
| పేజీలు | : | 56 |
| వెల రూ. | : | అమూల్యం |



1. శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము,
చిల్లకల్లు - 521 178, జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.

2. **RAVI MOHANA RAO, M.Sc.,** M.A. (Sanskrit)
4-103, I.L.T.D. Colony, Extn.,
Kothapet, Chirala.
Cell: **94401 15411**

***D.T.P. by :-***
**J. RAJA**
18, Banam Complex,
Munthavari Centre, Chirala.
Cell : 98483 90564

***Printed at :-***
**Sowmya Offset,**
CHIRALA.
Cell : 98480 88156



శ్రీః

# స్వయంవరకళాస్తోత్రమ్

సంస్కృతమూలము- శ్రీ దుర్వాసోమహాముని
వ్యాఖ్యాత - డా॥ నిష్ఠల సుబ్రహ్మణ్యం
రీడర్, సంస్కృత కళాశాల, పొన్నూరు



మన్త్రశాస్త్రమున "స్వయంవరకళా" అని ఒక దేవత గలదు. ఈ స్తోత్రమును శ్రీ దుర్వాసోమహాముని రచించి యుండెను. శ్రీ దుర్వాసోమునీంద్రులు అత్రిమహర్షికి అనసూయాదేవికి జన్మించినవారు. మహాతపస్వి అయిన వీరు లలితాంబాభక్తులలో అగ్రగణ్యులు. వీరు రచించిన గ్రంథరత్నములు - 1) పరశంభుమహిమ్నస్తోత్రము, 2) ఆర్యాద్విశతి, 3) స్వయంవరకళాస్తోత్రము 4) త్రిపురామహిమ్నస్తోత్రము. స్వయంవరకళకు ఋషి, ఛందస్సు, దేవత, బీజశక్తి కీలకములు అంగన్యాసకరన్యాసములు మన్త్రశాస్త్రమున ప్రతిపాదింపబడినవి. యంత్రము, షోడశోపచారపూజ, ఆవరణార్చనలు సంపూర్ణముగా వివరించబడియున్నవి. గురుముఖతః దీక్షను పొంది జప-హోమ-తర్పణ-బ్రాహ్మణ భోజనములతో సిద్ధిని పొందవచ్చును. నేయి, పాయసము, నువ్వులతో హోమము విధింపబడినది. లేదా మోదుగపూలతోనైనను హోమము చేయదగియున్నది. కుజదోష పరిహారానికి గూడ చంద్రసమిధలు, గన్నేరుపూలు ఉపయోగపడతాయి. శ్రీ రామానందనాథులు శ్రీ బాలావిద్యాపీఠం పక్షాన సంకలనము చేసిరి.

**ఫలము :** కన్నెపిల్లలకు అమంగళములు, దోషములు తొలగి త్వరగా వివాహమగుట దీని ప్రయోజనము.

**ఉద్దేశము :** సంపూర్ణముగా జపహోమాదులు, యన్త్రపూజలు ఉపదేశము పొందిన సాధకులచే నిర్వహింపజేసికొనుట సముచితమే అయినా ఈ కాలంలో ఎక్కువమంది అలా చేయలేరు గనుక ఈ స్తోత్రాన్ని కన్నెలు ప్రతిదినము చదువుకున్నను ఫలితం ఉంటుంది. ఒక సాధకుడీస్తోత్రాన్ని నాచే చదివించి క్యాసెట్టు చేయించుకొని వెళ్ళినాడు. అది వినుచున్నను కొంత ఫలితముండునని వారి యభిప్రాయము. ప్రతిపదార్థ-తాత్పర్యములతో దీనిని ముద్రించిన అనేకమందికి ఉపయోగపడునని నా భావన. పండితులకు వ్యాఖ్యగాక సామాన్యులకును తెలియుటకై ప్రతిపదార్థ-తాత్పర్యములు వ్రాయబడినవని గ్రహించి ఫలమును పొందగలరు.

స్వయంవరకళానుతిః

శ్లో॥ బన్ధూకవర్ణామరుణాం సుగాత్రాం
శమ్భుం సముద్దిశ్య శనైరుపేతామ్।
అమ్భోజమృద్వీమభిలాషదాత్రీం
సమ్భావయే నిర్జరదారుకల్పామ్॥ 1

ప్రతిపదార్థము : బన్ధూకవర్ణామ్=మంకెనపువ్వువలె ఎఱ్ఱని రంగుగలది, అరుణామ్=లేత ఎఱుపురంగుతో కూడా కలసినది, సుగాత్రామ్=అందమైన శరీరముగలిగినట్టిది, శమ్భుమ్=శంకరుని, ఉద్దిశ్య=లక్ష్యముగా చేసికొని, శనైః=మెల్లగా, ఉపేతామ్=సమీపించు నట్టిది, అమ్భోజ=తామరపువ్వువలె, మృద్వీమ్=మెత్తని శరీరముగలది, అభిలాష=కోరికలను, దాత్రీమ్=ఇచ్చునట్టిది, నిర్జర=దేవతల, దారు=వృక్షము అనగా కల్పవృక్షముతో, కల్పామ్= సమానమైనట్టిది అయిన దేవిని, సమ్భావయే=తలచుచున్నాను.

**భావము :** మంకెనపువ్వు ఎఱ్ఱగా ఉంటుంది. అటువంటి ఎఱ్ఱని కాంతి, లేత ఎఱుపు రంగు కలిసిన కాంతి విశేషం గలది ఆ జగజ్జనని అయిన పార్వతీదేవి. శాస్త్రములలో చెప్పబడినట్లు చక్కని అవయవములతో కూడిన శరీరం గలది. తన మనస్సులో ఉన్న శంకరుని వివాహమాడదలచి నెమ్మదిగా (మందగమనంతో) ఆతనిని సమీపిస్తుంది. తామరపువ్వువలె ఆమె శరీరం చాలా కోమలమైనది. ఆమె భక్తుల కోరికలను తీర్చునట్టిది. కావుననే ఆమె దేవతల కల్పవృక్షంతో సమానమైనది. అట్టి స్వయంవరకళారూపిణి అయిన పార్వతీదేవిని మనస్సులో ధ్యానించుచున్నాను.

**విశేషము :** శోభనం గాత్రం యస్యాః సా అను విగ్రహముతో సుగాత్రపదముకంటె 'నాసికోదరౌష్ఠజఙ్ఘదన్తకర్ణశృఙ్గాచ్చ' అను సూత్రమునకునను బంధమైన 'అఙ్గగాత్రకణ్ఠేభ్యో వక్తవ్యమ్' అను వార్తికముచే వికల్పముగా జీష్ (ప్రత్యయము). కావుననీ ప్రత్యయము రానిచో టాప్ వచ్చి సుగాత్రా అను పదమేర్పడును.

శ్లో॥ హ్రీమన్థరాణి చరణాగ్రగతిప్రపాతే
ష్వామఞ్జుసంక్వణితకఙ్కణకిఙ్కిణీని।
కామం కుమారి! తవ తాని శివే స్మరామి
క్షేమఙ్కరాణి జనకాలయఖేలనాని॥ 2

ప్రతిపదార్థము : కుమారి=ఓ బాలికా!, శివే=మఙ్గళములను కలిగించు దేవీ!, తవ=నీయొక్క, హ్రీమన్థరాణి=సిగ్గుచే మెల్లగానున్నట్టివి, చరణాగ్ర=పాదముల ముందు భాగములతో కూడిన, గతి=నడకలలో (పొరాదుటయని), ప్రపాతేషు=పడుటలయందు, ఆమఞ్జు=పూర్తిగా మనోహరములైన, సంక్వణిత=ధ్వనులతో కూడిన, కఙ్కణ=కడియముల యొక్క కిఙ్కిణీని=చిన్న చిన్న గంటలు గలిగినట్టివి, క్షేమఙ్కరాణి=మేలును కలిగించునట్టివియైన, తాని=ప్రసిద్ధములైన, జనకాలయ=తండ్రి యింటిలోగల, ఖేలనాని=ఆటలను, కామమ్= ఎక్కువగా, స్మరామి =తలచుచున్నాను.

**భావము :** శ్రీ దుర్వాసోమహాముని అమ్మవారితో చెప్పుచున్నారు. ఓ బాలికా! మంగళములను కలిగించుదానా! సిగ్గుచేత మెల్లగా నున్నవి, ముందు కాళ్ళతో నడుచుచు అనగా పారాడుచు చిన్నతనము వలన పడిపోవుచుండుట వలన ఆ కాలిగి గల అందెలు లేక గజ్జెలకు గల చిన్న చిన్న గంటలు మనసుకు ఆనందము కలుగునట్లు మ్రోతలుగలవి, లోకమునకు ఆనందమును కలిగించునవి అయిన నీ తండ్రియైన హిమవంతుని యింటిలోని యాటలను ఎంతో తన్మయత్వముతో భావించుచున్నాను.

**శ్లో॥ యోగేన బాల్యవయసా లలితాం పురస్తాత్**
**ద్రాగేవ కణ్ఠవిలసత్కనకోర్మికౌఘామ్।**
**అక్రమనద్ధరశనాం భవతీం నిరీక్షే**
**శ్రీకణ్ఠభామిని! కదా ప్రపదీనవేణీమ్॥ 3**

**ప్రతిపదార్థము :** శ్రీకణ్ఠభామిని!=ఓ శివుని యర్ధాంగియైన తల్లీ!, యోగేన=యోగశక్తిచేత, బాల్యవయసా=చిన్న వయసు చేతను, లలితామ్=సుకుమారవతి, కణ్ఠ=కంఠమునందు, విలసత్=ప్రకాశించుచున్న, కనక=బంగారముచే చేయబడిన, ఊర్మికా=గుండ్రని, చిన్న వలయముల, ఓఘామ్=సమూహముల (దండ) తో కూడినది. అక్రమ=చాల సొగసుగానుండి, నద్ధ=కట్టబడిన, రశనామ్=వడ్డాణముగలిగినది, ప్రపదీన=కాలి మడమల వఱకుగల, వేణీమ్=జడ గలిగినదానివియైన, భవతీమ్=నిన్ను, పురస్తాత్=ఎదురుగా, ద్రాగేవ=శీఘ్రముగా, కదా=ఎప్పుడు, నిరీక్షే=చూడగలనో గదా!

**భావము :** ఓ శివకామినీ! నీవు సహజముగా యోగమాయవి అగుటచేతను, చిన్న వయసులో నుండుట వలనను కోమలమైనదానివి. నీవు మెడలో బంగారపు చిన్న చిన్న వలయముల దండతో ప్రకాశించుచుంటివి (రింగుల గొలుసు). అందమైన వడ్డాణమును ధరించినావు. నీకు కాలి మడమల పర్యంతము వ్రేలాడు పొడవైన జడగలదు. అట్టి నిన్ను ఎదురుగానెప్పుడు సాక్షాత్కరించుకొందునో గదా!

ఇట భవిష్యదర్థమున 'నిరీక్షిష్యే' అనిగాక నిరీక్షే అని వాడబడినది. అతిసమీప భావికాలమున వర్తమానము 'వర్తమానసామీప్యే వర్తమానవద్వా' అని సూత్రము.

**శ్లో॥ గిర్యల్పముగ్ధవిశదం నవయౌవనం శ్రీ**
**ధుర్యం విలాసమయమఞ్జుకృశం విలగ్నే।**
**పర్యుచ్ఛ్రితం కుచభరే జఘనే ఘనం యత్**
**పర్యుత్సుకోఽస్మి సతతం జనని ప్రసీద॥ 4**

**ప్రతిపదార్థము :** జనని=ఓ తల్లీ!, గిరి=మాటలయందు, అల్ప=కొంచెము, ముగ్ధ=అమాయకత్వముతో, విశదం=స్వచ్ఛమైనదియు, శ్రీధుర్యమ్=ఎక్కువ శోభతోకూడినది, విలాసమయ=శృంగారచేష్టలతో నిండినది అందువలననే, మఞ్జు=సొగసైనదియు, విలగ్నే=నడుము వద్ద, కృశం=చిక్కినది, కుచభరే=స్తనభారమునందు, పర్యుచ్ఛ్రితమ్=మిక్కిలి ఎత్తైనది,

జఘనే=వెనుక భాగము, ఘనమ్=కిక్కిరిసినట్టిది అయిన, యత్=ఏ, నవ=కొం(గొత్తదైన, యౌవనమ్=మంచి (ప్రాయము గలదో దానిని, పర్యుత్సుకః=చూడవలెనను తహతహగల వానినిగా, అస్మి=ఉన్నాను, సతతమ్=ఎల్లప్పుడు, (ప్రసీద=అను(గహించుము.

**భావము :** ఈ శ్లోకమునందు మహర్షి అమ్మవారి యౌవనమును వర్ణించుచున్నారు. ఆమె మాటలు ముద్దరాలితనముతో స్వచ్ఛమైయుండును. అనేక శోభలను ధరించియుండును. పెక్కు సింగారపు చేతలతో డెందమునానందపఱచును. యౌవన(ప్రభావము వలన నడుము సన్నముగను, వక్షస్థలమున్నతముగను, వెనుకభాగము బిగితనముతో నిండియుండును. తల్లీ! అట్టి నీ జవ్వనమును చూడ వేడుకపడుచున్నాను. ఎల్లప్పుడు అను(గహించుము.

**వివరణము :** స్వభావముచేతనే స్త్రీలకు యౌవనమున కొన్ని చేష్టలు కలుగును. అవి లీల, విలాసము, విచ్ఛిత్తి, బిబ్బోకము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, వి(భ్రమము, లలితము, మదము, విహృతి, తపనము, మౌగ్ధ్యము, విక్షేపము, కుతూహలము, హసితము, చకితము, కేళియని పదునెనిమిది గలవు. ఇట్లే భావహావహేలలు.

సాహిత్యదర్పణమున ఇరువదియెనిమిది గలవు. పైవాటితోబాటు శోభ, కాంతి, దీప్తి, మాధుర్యము, (ప్రగల్భత, ఔదార్యము, ధైర్యమనునీ యేడును కలియును. వీని లక్షణములు సాహిత్య (గ్రంథములనుండి (గ్రహింపవలయును.

**శ్లో॥ నిర్ధూతకుణ్డలముదఞ్చితఘర్మలేశమ్**
**వి(స్రస్తకేశమభితశ్చలదీక్షణాన్తమ్।**
**నిర్ధ్వానికఙ్కణముద(గ్రకుచాన్తమన్త**
**ర్బధ్నామి తాతగృహకన్దుకఖేలనం తే॥ 5**

**(ప్రతిపదార్థము :** నిర్ధూత=కదల్చబడిన, కుణ్డలమ్=చెవిపోగులు కలిగినదియు, ఉదఞ్చిత=ఏర్పడిన (ఆవిర్భవించిన), ఘర్మలేశమ్=చిఱుచెమటలు గలది, వి(స్రస్త=చెదరిన, కేశమ్=వెం(ట్రుకలు గలది, అభితః=నలువైపులా, చలదీక్షణాన్తమ్=కదలుచున్న చూపుల చివఱి భాగముగలది (అనగా వాలుచూపులు), నిర్ధ్వానికఙ్కణమ్=సవ్వడి చేయుచున్న గాజులు గలట్టిది, ఉద(గ=ఉత్కటమైన అనగా అదరుచున్న, కుచాన్తమ్=స్తనముల చివఱి భాగముగలట్టిది అయిన, తే=నీయొక్క తాతగృహ=తం(డియింటిలోని, కన్దుక=బంతియొక్క ఖేలనమ్=ఆటను, అన్తః=నామనమున, బధ్నామి=బంధించుచున్నాను అనగా స్థిరముగా ధ్యానించుచున్నాను.

**భావము :** ఈ శ్లోకమున దుర్వాసోమహాముని తం(డియైన హిమవంతుని యింటిలో పార్వతి యాడిన బంతియాటను వర్ణించుచున్నారు. బంతియాట యాడునపుడు చెవులకు ధరించిన పోగులు కదలాడుచుండును. కొంచెము అలియుటచే ఆమె మోమున చిఱుచెమటలేర్పడును. ముంగురులును అటునిటు చెదరుచుండును. బంతి

పరుగెత్తుచుండును గావున అది వెళ్ళిన నలువైపులకు ఆమె వాలుచూపులు ప్రసరించు చుండును. బంతియాడునపుడు చేతిగాజులు గలగల సవ్వడి చేయుచుండును. ఆమె వక్షస్థలమునదరును. అట్టి తండ్రి యింటిలో నీవాడిన బంతియాటలను నిశ్చలముగా నా మనమున ధ్యానించుచున్నాను.

శ్లో॥ యోగీశ్వరం ప్రచురభక్తిగిరీశమారా
దేకాన్తవర్తినముపేత్య తపశ్చరన్తమ్।
ఆకాజయా పరిచరిష్ణుమనాకులాం త్వాం
యే కేచిదీశ్వరి భజన్తి త ఏవ ధన్యాః॥ 6

ప్రతిపదార్థము : ఈశ్వరి=ఓ పార్వతీ!, యోగీశ్వరమ్=యోగులకే ప్రభువైన మహాయోగిని, ఏకాన్తవర్తినమ్=ఎవ్వరును లేనిచోటనున్నట్టి, తపశ్చరన్తమ్=తపస్సును చేయుచున్నట్టి, గిరీశమ్=శివుని, ఉపేత్య=సమీపించి, ఆకాజయా=ఆతని వివాహమాడవలెనను బలమైన కోరికతో, ప్రచురభక్తి=మిక్కిలి భక్తి కలుగునట్లుగా, పరిచరిష్ణుమ్=అన్ని విధముల లెస్సగా సేవచేయుచున్న, అనాకులామ్=ఎట్టి సందేహము లేక నిశ్చలముగానున్న, త్వామ్=నిన్ను, యేకేచిత్=ఏ కొంతమంది, భజన్తి=సేవించుచున్నారో, త ఏవ=వారే, ధన్యాః=సార్థకులు.

భావాలు: దక్షయజ్ఞమున సతీదేవి శరీరమును విడచిన పిమ్మట శంకరుడు హిమాలయముపై తపస్సు చేయుచుండెను. యోగీశ్వరుడై ఒంటరిగానున్నట్టి యా శివుని సమీపించి, అతనిని వివాహమాడవలెనను బలమైన కోరికతో నిశ్చలమైన మనస్సుతో ఎక్కువ భక్తిశ్రద్ధలతో సేవించితివి. ఓ పార్వతీ! అట్టి నిన్ను ఏ కొద్దిమంది ధ్యానించుచు సేవించుచున్నారో వారే ధన్యులు.

విశేషము : పార్వతి శివునెట్లు సేవించినదో కాళిదాసు కుమారసంభవమున నిట్లు వర్ణించెను.

"అవచితబలిపుష్పావేదిసమ్మార్గదక్షా-నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ।
గిరిశముపచచారప్రత్యహం సా సుకేశీ-ప్రశమితపరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః॥"

పూజకు పువ్వులను కోసి సేకరించుచున్నదై వేదికను శుభ్రము చేసి ముగ్గులు గీసినదై, నియమపూర్వక కార్యములకు నీటినీ, దర్భలను తెచ్చుచున్నదై ఆతని శిరస్సుపైగల చంద్రుని కిరణములతో బడలికను పోగొట్టుకొనినదై ప్రతిదినము పార్వతి హిమాలయముపై తపస్సు చేయుచున్న శివుని సేవించినది.

శ్లో॥ గిర్యాత్మజే మదనదాహమహావమాన-
పర్యాకులే పురహరే హృదయం నిధాయ।
కుర్యాస్తపో విదధతీ కుశలాని భూభృ-
త్పర్యాయపీనకుచకుమ్భవిశుమ్భదజ్గీ॥ 7

పద విభాగము : గిర్యాత్మజే, మదనదాహమహావమానపర్యాకులే, పురహరే, హృదయం, నిధాయ, కుర్యాః, తపః, విదధతీ, కుశలాని, భూభృత్పర్యాయపీనకుచకుమ్భవిశుమ్భదజ్గీ.

**ప్రతిపదార్థము :** గిర్యాత్మజే!=ఓ పర్వతరాజపుత్రీ!, మదన=మన్మథుని, దాహ=భస్మము చేయుటచే కలిగిన, మహా=గొప్పదైన, అవమాన=తిరస్కారముచే, పర్యాకులే=కలత చెందినదానా!, పురహరే=పట్టణములు కాల్చినవానియందు అనగా శివునియందు, హృదయమ్=డెందమును, నిధాయ=నిలిపి, తపః=తపస్సును, విదధతీ=చేయుచున్నదానివి, భూభృత్=పర్వతమునకు, పర్యాయ=మారుగానున్న, పీన=బలిష్ఠములైన, కుచ=స్తనము లనెడి, కుమ్భ=కడవలచే, విశుమ్భత్=మిక్కిలిగా ప్రకాశించుచున్న, అఙ్గీ=శరీరము గలదానవైన నీవు, కుశలాని=మంగళములను, కుర్యాః=చేయుము.

**భావము :** హిమాలయమునకు కుమార్తెవైన ఓ తల్లీ! నీవు పర్వతములకు మారుగా నున్న స్తనములతో ప్రకాశించు శరీరముతో నొప్పారుచుంటివి. శివుడు తన మూడవ కంటితో మన్మథుని బూడిద చేయుటచే కలిగిన తిరస్కారభావముతో కలత చెంది యుంటివి. అయినను పట్టువిడువక ఇట్లే, లోగడ పట్టణములను జయించిన శంకరునియందే మనస్సును నిలిపి ఐదు నిప్పుల నడుమ తీవ్రమైన తపస్సును చేయుచున్నదానివై మాకు మంగళములను కలిగింపుము.

శ్లో॥ నిధ్యాయమానసుదృశా ముహురిన్దుచూడం
మధ్యే స్థితా రహసి పఞ్చ హుతాశనానామ్।
తత్తాదృశేన తపసా జగదణ్డభాజాం
విత్రాసదాత్రి పరిపాహి సదా శివే నః॥ 8

**పదవిభాగము :** నిధ్యాయమానసుదృశా, ముహుః, ఇన్దుచూడమ్, మధ్యే, స్థితా, రహసి, పఞ్చహుతాశనానామ్, తత్తాదృశేన, తపసా, జగదణ్డభాజామ్, విత్రాసదాత్రి, పరిపాహి, సదా, శివే, నః

**ప్రతిపదార్థము :** జగత్=ప్రపంచమునందలి, అణ్డభాజామ్=జీవులకు, విత్రాస=ఎక్కువ భయమును, దాత్రి=ఇచ్చునట్టి (లేదా పోగొట్టునట్టి), శివే=ఓ పార్వతీ!, పఞ్చ=ఐదైనట్టి, హుతాశనానామ్=నిప్పుల, మధ్యే=నడుమ, రహసి=ఏకాంతముగా, స్థితా=ఉన్నదానవై, ఇన్దుచూడమ్=చంద్రుని తలపై ధరించిన శంకరుని, నిధ్యాయమాన=మిక్కిలిగా ధ్యానించుచున్న, సుదృశా=చక్కని చూపు (అంతర్దృష్టి) గల, తత్తాదృశేన=చాలా ప్రసిద్ధమైనటువంటి, తపసా=తపస్సుచే, నః=మమ్ము, సదా=ఎల్లప్పుడును, పరిపాహి=అన్ని విధముల కాపాడుము.

**భావము :** ఈ సమస్త విశ్వములోని ప్రతి ప్రాణికి భయమును కలిగించుటకు, కాపాడుటకు సమర్థురాలైనది ఆ పరమేశ్వరి. ఆమె సర్వమఙ్గళ. శిక్షించుటకు, రక్షించుటకును సమర్థురాలు. దుర్జనులను శిక్షించుటచేతను, మంచివారిని లెస్సగా కాపాడుటచేతను ఆమె మంగళములను కలిగించును గావున సర్వమంగళయైనది. ఆమె శివుని భర్తగా పొందదలచి పైన సూర్యుడును, నలువైపుల అగ్నులుండగా వాటి నడుమ నొంటరిగా

నుండి తీవ్రమైన తపస్సును చేసినది. పరమాత్మయైన శివుని జ్ఞానదృష్టితో తనతో భేదం లేనట్లు ధ్యానము చేసినది. అట్టి ఆమె తపోదృష్టిచే ఎల్లప్పుడు మనలను కాపాడవలయునని కవి యాకాంక్ష.

శ్లో॥ యోగ్యం వటోర్వపురుపస్థితమాత్మభక్తిం
దీర్ఘాం పరీక్షితుమనుక్షణమాక్షిపన్తమ్।
సాక్షాద్గిరీశమవధూయ రుషా ప్రయాతే
ద్రాక్తేన సంశ్రితపదాం భవతీం భజామః॥ 9

పదవిభాగము : యోగ్యం, వటోః, వపుః, ఉపస్థితమ్, ఆత్మభక్తిమ్, దీర్ఘామ్, పరీక్షితుమ్, అనుక్షణమ్, ఆక్షిపన్తమ్, సాక్షాత్, గిరీశమ్, అవధూయ, రుషా, ప్రయాతే, ద్రాక్, తేన, సంశ్రితపదామ్, భవతీమ్, భజామః.

ప్రతిపదార్థము : వటోః=బ్రహ్మచారికి, యోగ్యమ్=తగినట్టి, వపుః=శరీరమును, ఉపస్థితమ్=ఆశ్రయించినట్టి, దీర్ఘామ్=ఎక్కువైన, ఆత్మభక్తిమ్=తన భక్తిని, పరీక్షితుమ్=పరీక్షించుటకు, అనుక్షణమ్=ప్రతిక్షణమునందు, ఆక్షిపన్తమ్=ఎత్తి పొడుపుగా అనగా ఎకసెక్కియముగా మాటలాడుచున్నట్టి, సాక్షాత్=ప్రత్యక్షముగా, గిరీశమ్=శంకరుడైనట్టి ఆ బ్రహ్మచారిని, అవధూయ=తిరస్కరించి, రుషా=కోపముతో కూడిన, ప్రయాతే=గమనము నందు, ద్రాక్=త్వరగా (వెంటనే), తేన=ఆ శివునిచేతనే, సంశ్రిత=పట్టుకొనబడిన, పదామ్=పాదములు గల, భవతీమ్=నిన్ను, భజామః=సేవించుచున్నాము.

భావము : ఈశ్వరుడు పార్వతీదేవికి తనపైగల దృఢభక్తిని పరీక్షింపదలచి బ్రహ్మచారికి తగిన వేషమును ధరించి ఆమె ఆశ్రమమునకు వచ్చి శంకరుని, ఆతనిని కోరిన పార్వతిని ప్రతిక్షణము విమర్శించుచుండెను. దానిని సహింపలేక కోపమును పొందిన పార్వతి అట్లు వచ్చినవాడు సాక్షాత్తుగా శంకరుడే యని గుర్తింపలేక తిరస్కరించి వెళ్ళుచుండగా శంకరుడు వెంటనే ఆమె పదములను పట్టి ఆపెను. అటువంటి పార్వతిని సేవించుచున్నాము. ఈ సందర్భమున కాళిదాసు "మార్గాచలవ్యతికరాకులితేవ సిన్ధుః శైలాధిరాజతనయా న యమౌ న తస్థౌ" అని వర్ణించినాడు. చిఱునగవుతో శివుడు తన యెదుట ప్రత్యక్షము కాగా దారికడ్డముగా కొండ తగిలినపుడు నది వలె పార్వతి సిగ్గుతో నిలువలేక ముందుకు సాగలేకపోయినదట.

శ్లో॥ గేహే నిజే వరణదామలసత్కరాబ్జాం
వ్యాహారినూపురముదఞ్చితమన్దహాసమ్।
నీహారభూమిజనిముచ్చలితాం వరీతుం
మోహావహాం త్రిభువనస్య భజామహే త్వామ్॥ 10

పదవిభాగము : గేహే, నిజే, వరణదామలసత్కరాబ్జామ్, వ్యాహారినూపురమ్, ఉదఞ్చితమన్దహాసమ్, నీహారభూమిజనిమ్, ఉచ్చలితామ్, వరీతుమ్, మోహావహామ్, త్రిభువనస్య, భజామహే, త్వామ్.

**ప్రతిపదార్థము :** నిజే=తనదైన, గేహే=ఇంటిలో, వరణ=స్వయంవరమునకై ఏర్పాటు చేయబడిన, దామ=పుష్పమాలచే, లసత్=ప్రకాశించుచున్న, కరాబ్జామ్=తామరపూలవంటి చేతులుకలిగినట్టిది, వ్యాహారి=సవ్వడిచేయుచున్న, నూపురమ్=ఆకాలియందియలు కలుగునట్లును, ఉదఞ్చిత=పెల్లుబికి వచ్చుచున్న, మన్ద=చిఱు, హాసమ్=నవ్వుకలుగునట్లు గాను, వరీతుమ్=వరించుటకు (శివుని), ఉచ్చలితామ్=బయలుదేరినట్టి, త్రిభువనస్య=ముల్లోకములకు, మోహావహామ్=ఆకర్షణను కలిగించునట్టి, నీహారభూమి=మంచుకొండ యొక్క, జనిమ్=కూతురువగు, త్వామ్=నిన్ను, భజామహే=సేవించుచున్నాము.

**భావము :** పార్వతి యింటిలో స్వయంవరమేర్పాటు చేయబడినది. ఆ స్వయంవరములో పార్వతి శివుని తన పెనిమిటిగా యెంచుకొనుటకై తామరపువ్వుల వంటి తన చేతులతో పూలదండను పట్టుకొనియున్నది. ఆ సమయమున కాలియందెలు మ్రోయుచున్నవి. ఆమె మోమున చిఱునవ్వు తొణికిసలాడుచున్నది. శివుని వరించుటకై నడచుచున్న ఆమె ముజ్జగములకును అనిర్వచనీయమైన యాకర్షణను కలిగించుచున్నది. అట్టి పార్వతిని మేము సేవించుచున్నాము.

శ్లో॥ శ్వస్తాహికఙ్కణవిలోకనభీతభీతం
ప్రత్యగ్రరాగవివశం మమ తం నిధేహి।
ఉత్స్వేదవేపథు పినాకభృతా గృహీతం
రుద్రాణి! దక్షిణకరామ్బుజముత్తమాఙ్గే॥ 11

**పదవిభాగము :** శ్వస్తా, అహికఙ్కణవిలోకనభీతభీతమ్, ప్రత్యగ్రరాగవివశమ్, మమ, తమ్, నిధేహి, ఉత్స్వేదవేపథు, పినాకభృతా, గృహీతమ్, రుద్రాణి, దక్షిణకరామ్బుజమ్, ఉత్తమాఙ్గే.

**ప్రతిపదార్థము :** రుద్రాణి=ఓ శివుని యిల్లాలివైన పార్వతీ!, శ్వస్తా=దృఢ భక్తిగలదానివైన నీవు, అహి=పాములే, కఙ్కణ=వలయములుగాగల శివుని, విలోకన=చూచుట చేత, భీతభీతమ్=ఎక్కువగా భయపడిన (అనగా ముందుకు వచ్చుటకు జంకుచున్న), ప్రత్యగ్ర=క్రొత్తగా ఏర్పడిన, రాగ=అనురాగము చేత (ఎఱుపుదనము చేతను యనియు), వివశమ్=పట్టు లేనట్టిదియు, పినాకభృతా=శంకరునిచే, గృహీతమ్=పట్టుకొనబడినది యనగా పాణిగ్రహణము చేయ బడినదియు, (అతఏవ=ఇందువలననే), ఉత్స్వేద=చిఱుచెమటలు కలిగినదియు, వేపథు=కొంచెముగా వణకుచున్నట్టిదియునైన, తమ్=ఆ ప్రసిద్ధమైన, దక్షిణ=కుడి, కరామ్బుజమ్= తామరపువ్వువంటి చేతిని, మమ=నాయొక్క, ఉత్తమాఙ్గే=తలపై, నిధేహి=ఉంచుము.

**భావము :** ఓ శివుని రాణివైన ఓ జగజ్జననీ! శంకరునిపై నీకు దృఢభక్తి యున్నది. ఆతడు నీ చేతిని పట్టుకొనినపుడు ఆతని చేతులకు వలయములుగా గల పాములను చూచి భయపడుటచే చేయి వణకినది. మనస్సులో క్రొత్త ప్రేమలు కలుగుటచే చేతులును ఎఱ్ఱబడి పట్టు తప్పినవి. శివుడు చేతిని పట్టుకొనుటచే చిఱుచెమట కలుగుటయేగాక

కొంచెము శృంగారభావముచే వణకినది. అటువంటి అమె కుడిచేతిని తన శిరస్సుపై నుంచి కాపాడుమని ముని ప్రార్థించుచున్నారు.

**విశేషములు :** ఎక్కువగా భయపడినయను అర్థమున ద్విరుక్తి భీతభీతయని వాడబడినది. ఇందుకు, "ఖష్టస్సన్ నయనమరీచి నీలనీలః" అని దండి ప్రయోగము.

శ్లో॥ రిష్టాపహం భవతు భర్తృనఖేన్దుబిమ్బ
స్పష్టానుబిమ్బితతనుం విబుధాపగాం తామ్।
దృష్ట్వాశు రాగరభసోదయశోణకోణం
దృష్టిద్వయం తవ కరగ్రహణే స్థితం నః॥ 12

**పదవిభాగము :** రిష్టాపహమ్, భవతు, భర్తృనఖేన్దుబిమ్బస్పష్టానుబిమ్బితతనుమ్, విబుధాపగామ్, తామ్, దృష్ట్వా, ఆశు, రాగరభసోదయశోణకోణమ్, దృష్టిద్వయమ్, తవ, కరగ్రహణే, స్థితమ్, నః.

**ప్రతిపదార్థము :** (ఓ పార్వతి!) తవ=నీయొక్క, కరగ్రహణే=వివాహసమయమునందు, భర్తృ=పెనిమిటియైన శివునియొక్క, నఖ=గోళ్ళను, ఇన్దు=చంద్రునియొక్క, బిమ్బ= మండలము నందు, స్పష్ట=చక్కగా (విశదముగా), అనుబిమ్బిత=అనుసరించి ప్రతిఫలించిన, తనుమ్=శరీరము గల, తామ్=ప్రసిద్ధమైన, విబుధ=దేవతల యొక్క, అపగామ్=నదిని, దృష్ట్వా=చూచి, ఆశు= వెంటనే (త్వరగా), రాగ=అనురాగము యొక్క, రభస=వేగముగా, ఉదయ=పుట్టుట చేత, శోణ=ఎఱ్ఱబారిన, కోణమ్=అంచులుగలట్టిదై, స్థితమ్=ఆకర్షణీయమై ఒప్పారుచున్న, దృష్టిద్వయమ్=చూపుల జంట, నః=మాయొక్క, రిష్ట=అశుభములను, అపహమ్= పోగొట్టునదిగా, భవతు=అగుగాక.

**భావము :** ఓ పార్వతీ! నీ వివాహవేళ నీ పతియైన శంకరుని తెల్లని కాలిగోరులే చంద్రబింబము వలె నుండుటచే దానియందు మాఱురూపముగ తోచిన శరీరముగల దేవనదియైన గంగామతల్లిని గాంచినపుడు నీ డెందమున వెంటనే మిక్కిలి ప్రేముడి కలుగుటచే ఎఱ్ఱనైన కనుకొలకులు గల నీ చూపుల జంట మా కష్టములనన్నింటిని (ఆధ్యాత్మిక–ఆధిదైవిక – అధిభౌతికములు) తొలగించునదిగానగు గాక.

శ్లో॥ యోగే నవే తవ భవాని! శివాని దద్యా-
ద్ద్రాగేవ సత్వరమపత్రపయా నివృత్తమ్।
సాకమ్పమాలివచనైర్విహితాభిముఖ్యం
ద్రాగుత్స్మితం పురభిదా పరిరబ్ధమఙ్గమ్॥ 13

**పద విభాగము :** యోగే, నవే, తవ, భవాని, శివాని, దద్యాత్, ద్రాక్, ఏవ, సత్వరమ్, అపత్రపయా, నివృత్తమ్, సాకమ్పమ్ ఆలివచనైః, విహితాభిముఖ్యమ్, ద్రాక్, ఉత్స్మితమ్, పురభిదా, పరిరబ్ధమ్, అఙ్గమ్.

**ప్రతిపదార్థము :** భవాని=ఓ పార్వతీ, తవ=నీయొక్క నవే=క్రొత్తదియైన, యోగే=శంకరునితో కలయికయందు, ద్రాగేవ=శీఘ్రముగా, సత్వరమ్=వేగముతో కూడినదై, అపత్రపయా=సిగ్గు చేత, నివృత్తమ్=వెనుకకు మఱలినట్టిది, ఆలి=చెలికత్తెల, వచనైః=మాటల చేత, సాకమ్పమ్= కొంచెము వణకినట్టిదై, విహిత=చేయబడిన, ఆభిముఖ్యమ్=ఎదురు మొగముతో కూడినట్టిది, ద్రాగుత్స్మితమ్=ఆగక వెంటనే వచ్చిన చిఱునగవుతో కూడినది, పురభిదా= శంకరునిచే, పరిరబ్ధమ్=కౌగిలించుకొనబడినదైన, అఙ్గమ్=శరీరము, శివాని= మంగళములను, దద్యాత్= ఇచ్చుగాక.

**భావము :** ఓ పార్వతీ! వివాహమైన పిదప శంకరునితో మొదటి కలయికయందు సిగ్గుతో వెంటనే నీ శరీరము వెనుకకు మఱలినది మఱల కంపము కలదైనను చెలికత్తెల పలుకులచే ఎట్టకేలకు శివునకెదురుగా సాగిన నీ మృదులశరీరమును శివుడు ఆలింగనము చేసికొనగా అనురాగసూచకమైన చిఱునవ్వు నీ మోమున కన్పట్టినది. అట్టి నీ శరీరము జగన్మంగళమై మాకు శుభముల నొసంగుగాక.

**విశేషము :** ప్రార్థనయందు విధిలిజ్ ప్రయోగము కన్పట్టును. కావున దద్యాత్ అనినాడు కవి. దద్యాద్దయానుపవనో ద్రవిణామ్బుధారామ్ అని శ్రీ శంకరుల ప్రయోగము.

**శ్లో॥ గత్యా నితమ్బభరమన్థరయాసలజ్జై**
**రర్ధేక్షణైరసకలాక్షరవాగ్విలాసైః**
**హృద్యైశ్చ విభ్రమగుణైర్మదనారిధైర్య**
**ప్రస్తారహారిణి శివే! జనని! ప్రసీద ॥ 14**

**పదవిభాగము :** గత్యా, నితమ్బభరమన్థరయా, సలజ్జైః, అర్ధేక్షణైః, అసకలాక్షరవాగ్విలాసైః , హృద్యైః, చ, విభ్రమగుణైః, మదనారిధైర్యప్రస్తారహారిణి, శివే, జనని, ప్రసీద.

**ప్రతిపదార్థము :** నితమ్బ=పిఱుదుల, భర=బరువుచే, మన్థరయా=మెల్లగానున్న, గత్యా=నడక చేత, సలజ్జైః=సిగ్గుతో కూడిన, అర్ధేక్షణైః=వాలు చూపులతోను, అసకల=సంపూర్ణముకాని అనగా అస్పష్టమైన, అక్షర=అక్షరములుగల, వాక్=పలుకుల, విలాసైః=శృంగారచేష్టలతోను, చ=ఇంకను, హృద్యైః=మనస్సునాకర్షించునట్టి, విభ్రమ=విలాసముల, గుణైః= స్వభావముతోను, మదన= మన్మథునియొక్క, అరి=శత్రువైన శివుని యొక్క, ధైర్య=బెట్టుదనము యొక్క, ప్రస్తార= విస్తరించుటను, హారిణి=అపహరించిన, జనని= తల్లివైన, శివే=ఓ పార్వతీ, ప్రసీద= అనుగ్రహించుము.

**భావము :** ఓ తల్లీ, పార్వతీ! నితమ్బభారముచే మందగమనముతో సిగ్గుతో కూడిన వాలు చూపులతో, అస్పష్టమైన అక్షరములుగల మాటల సోయగముతో, మనస్సునాకర్షించు విభ్రమములతో మన్మథుని భస్మముచేసి ధీరుడనిపించుకొనిన మృత్యుంజయుని నిబ్బరమునే పెరగకుండనపహరించితివి గదా. అట్టి మహామాయావిలాసినివైన ఓ ఆదిశక్తీ మమ్మనుగ్రహింపుము.

**విశేషము :** విలాసములు అనగా శృంగార చేష్టలుద్దీపన విభావములు గదా. అవి భావహావాది చేష్టలు. వాలుచూపులనుభావములు. యౌవనమున సత్త్వోద్రేకమువలన ఇరువది యెనిమిది చేష్టలు గలుగును. ఇవి అలంకారములగును. "లీలావిలాసో విచ్ఛిత్తిర్బిబ్బోకః కిలికిఞ్చితం, మోట్టాయితం కుట్టమితం విభ్రమో లలితం మదః" అనువానిలో విలాసము విభ్రమము నిట చెప్పబడినవి. విలాసమనగా - "యానస్థానాసనాదీనాం ముఖనేత్రాదికర్మణాం-విశేషస్తు విలాసస్స్యాదిష్టసన్దర్శనాదినా" అని లక్షణము. అనగా చూచుటచే నడకలో, ఉనికిలో, కూర్చొనుట, మాటలాడుటలో కనపడు విశేషమే విలాసము. అనగా ఒయ్యారమని భావము. విభ్రమమనగా -"త్వరయా హర్షరాగాదేర్దయితా గమనాదిషు-అస్థానభూషణాదీనాం విన్యాసో విభ్రమో మతః" అని లక్షణము. ప్రియుడు వచ్చినపుడు కలిగిన సంతోషము, అనురాగము, తొందరచే ఆభరణములను తాఱుమాఱుగా ధరించుటయే విభ్రమమనబడును.

**ఈ లక్షణము :** ఇట సాదరముగా చూచుటను వర్ణించుటచే చక్షుఃప్రీతి అను మన్మథావస్థ చెప్పబడినది.

"ఆదరాద్దర్శనం చక్షుఃప్రీతిరిత్యభిధీయతే" అని లక్షణము. అనగా నాయిక నాయకుని యనురాగముతో చూచుటయని యర్థము.

**శ్లో॥ భద్రా ముఖేన్దునమనాదభివీక్షణేషు**
**ప్రత్యుక్తిదానవిరమాన్నవసత్కథాసు।**
**ఉద్వేజనాదపి హఠాత్పరిరమ్భణేషు**
**పత్యుః ప్రమోదజననీ జనని! ప్రసీద॥ 15**

**పద విభాగము :** భద్రా, ముఖేన్దునమనాత్, అభివీక్షణేషు, ప్రత్యుక్తిదానవిరమాత్, నవసత్కథాసు, ఉద్వేజనాత్, అపి, హఠాత్, పరిరమ్భణేషు, పత్యుః, ప్రమోదజననీ, జనని, ప్రసీద.

**ప్రతిపదార్థము :** జనని=ఓ తల్లీ!, అభివీక్షణేషు=భర్తయైన శంకరుని ఎదురుగానుండి వచ్చు చూపులయందు, ముఖేన్దు=జాబిల్లివంటి మోమును, నమనాత్=వంచుట వలన, నవ= క్రొత్తవైన, సత్కథాసు=రసవత్తరములైన గోష్ఠులయందుసైతము, ప్రత్యుక్తి=తిరిగి సమాధానమును, దాన=ఇచ్చుటనుండి, విరమాత్=మానుటవలన, హఠాత్=అనుకోకుండ నేర్పడిన, పరిరమ్భణేషు=బిగికౌగిలింతలయందు, ఉద్వేజనాత్+అపి=వెఱపువలనను, పత్యుః = భర్తయైన శంకరునికి, ప్రమోద=సంతోషమును, జననీ=కలిగించుచున్నదానివి, భద్రా= మఙ్గలవతివియైన నీవు, ప్రసీద=అనుగ్రహింపుము.

**భావము :** ఓ తల్లీ! నీవు మంగలవతివి (కావుననే సర్వమఙ్గల), భర్తయైన శివుడు నీ ఎదురుగా నుండి చూచునపుడు సిగ్గుతో ముఖమును దించుకొనుచుంటివి. క్రొత్త క్రొత్త కథలను, విశేషములను చెప్పునప్పుడు సిగ్గుతో బదులు చెప్పక యూరకుంటివి. హఠాత్తుగా

శివుడు కౌగిలించుకొనినపుడు తడబాటు, వెఱపును పొందుచుంటివి. ఇట్టి చేష్టలచే భర్త కానందమును గూర్చుచుంటివి. అట్టి నీవు నన్ననుగ్రహింపుము.

**విశేషము :** ఈ శ్లోకమున పార్వతి ముగ్ధనాయికగా వర్ణింపబడినది. పార్వతి చేష్టలన్నియు ముగ్ధత్వమునే తెలుపుచున్నవి. ముఖము వంచుకొనుట, బదులు చెప్పలేకపోవుట, కొంచెము భయపడుట ముగ్ధ లక్షణములు.

"ప్రథమావతీర్ణయౌవనమదనవికారా రతౌ వామా
కథితా మృదుశ్చ మానే సమధికలజ్జావతీ ముగ్ధా" అని సాహిత్యదర్పణమున విశ్వనాథుడు ముగ్ధాలక్షణమును తెలిపియున్నాడు.

శ్లో॥ యం నాథమాదిమునయో నిగమోక్తిగుమ్ఫే
ష్వాలక్ష్యతాత్తమనసో విముఖీభవన్తి।
సన్నహ్యా తేన దయితేన మనోజవిద్యా
నన్దానుభూతిరసికే జనని! ప్రసీద॥ **16**

**పదవిభాగము :** యమ్, నాథమ్, ఆదిమునయః, నిగమోక్తిగుమ్ఫేషు, ఆలక్ష్యతా+ఆత్తమనసః, విముఖీభవన్తి, సన్నహ్యా, తేన, దయితేన, మనోజవిద్యానన్దానుభూతిరసికే, జనని, ప్రసీద.

**ప్రతిపదార్థము :** మనోజ=మన్మథుని యొక్క, విద్యా=చదువు అనగా ఆకర్షణ, ఆనందము గల కామశాస్త్రము వలన నేర్పదు, ఆనన్ద=సంతోషము యొక్క, అనుభూతి=అనుభవము నందు, రసికే=రసజ్ఞురాలవైన, జనని=తల్లీ!, నిగమ=వేదములయందలి, ఉక్తి=పలుకుల, గుమ్ఫేషు=కూర్పులయందలి, ఆలక్ష్యతా=పొందదగినదానియందలి ఏకాగ్రభావముచే, ఆత్త=వ్యాపించిన, మనసః=మనసుగల, ఆదిమునయః=వ్యాసుదు, వాల్మీకి మొదలగు మూల పురుషులైన ఋషులు సైతము, యమ్=ఏ, నాథమ్=భర్తయైన శంకరుని ఆకర్షించు విషయమున, విముఖీభవన్తి=శక్తిచాలక ఉదాసీనులగుచున్నారో, తేన=అటువంటి, దయితేన=నీవల్లభుడైన శంకరునితో కూడిన, సన్నహ్యా=సంసిద్ధురాలవై, ప్రసీద= నన్ననుగ్రహించుము.

**భావము :** తల్లీ! నీవు మన్మథ విద్య వలన కలుగు సంతోషము యొక్క అనుభవముల సారమెఱిగినదానవు. వేదములయందు ఏ పరబ్రహ్మము చెప్పబడినదో, దేనిని పొందవలెనని సంపూర్ణ ధ్యానమునందు మనస్సును నిలిపిన గొప్ప గొప్ప మునులైనవారు కూడా నీ భర్త రూపముననున్న ఆ పరబ్రహ్మమును పొందలేకపోవుచున్నారో, అట్టి పరబ్రహ్మమైన నీ పతియైన శివునితో కలసి నన్నుద్ధరించుటకై అనుగ్రహించుము.

**విశేషము :** మునులు సైతము పొందలేని ఆ బ్రహ్మమును స్వాధీనపఱచుకొని అతనిలో సగపాలై శివశక్తిసామరస్యరూపముగా నుంటివి. శివశక్తులకు అవినాభావము 'చంద్రచంద్రికయోరివ' అను ఉపమానముచే చెప్పబడుటచే అభేదమే. శక్తిలేని శివుడుగాని లేదా శివుని విడచి శక్తిగాని ఉపాసించుట ఫలవంతముకాదని శాస్త్రము. అసలు శివుదు

లేని శక్తి ఉండదు. కావున శివనహితముగా రమ్మని భావము. ఇట్లే మహాలక్ష్మ్యుపాసనాదులునూ చెప్పబడినవి. నారాయణహృదయమును విడచి కేవలము లక్ష్మీహృదయమునే ఉపాసించిన లేక పారాయణము చేసినను అది వ్యర్థమగుటయే గాక లక్ష్మియు కోపగించుకొనును. ఇందులకు ప్రమాణమిట్లున్నది.

"లక్ష్మీహృదయకం స్తోత్రం యది చైతద్వినా కృతమ్
తత్సర్వం నిష్ఫలం ప్రోక్తం లక్ష్మీః క్రుధ్యతి సర్వదా"

కావున శివశక్తి సామరస్యముగనే సాధనచేసి సిద్ధిని పొందవలెను. ఈ వర్ణనమున పార్వతీ వేషము శివానుకరణముగానున్నది. శంకరుని శిరస్సుపై చంద్రరేఖ యున్నది. ఈమె కొప్పులో పూలదండయున్నది. శివుని తలపై కల్లోలినియనగా గంగ, ఈమె తలపై శోభాతరంగిణి. కావుననే మహేశ్వరి, శశిఖణ్డ, కల్లోలిత, మహేశ్వరి పదశక్తిమూలకమైనట్టిదియు, రూపకముచే సమాలంకారము వ్యంగ్యము. కల్యాణ మాలయను శశిఖణ్డమున సౌరభమభివ్యక్తమగుటచే వ్యతిరేకాలంకారమును వ్యంగ్యము అలంకార సంసృష్టి, శివశక్తులకభేదము అని తెలియవలయును.

శ్లో॥ కల్యాణకున్తలభరం నవకల్పవల్లీ
పుష్పోల్లసద్బహులసౌరభలోభనీయమ్।
కల్యాణదామశశిఖణ్డమఖణ్డశోభా
కల్లోలితం తవ మహేశ్వరి సంశ్రయామః॥ 17

**పదవిభాగము :** కల్యాణకున్తలభరమ్, నవకల్పవల్లీపుష్పోల్లసద్బహులసౌరభలోభనీయమ్, కల్యాణదామశశిఖణ్డమ్, అఖణ్డశోభాకల్లోలితమ్, తవ, మహేశ్వరి, సంశ్రయామః.

**ప్రతిపదార్థము :** మహేశ్వరి=పరమేశ్వరుని యిల్లాలివైన ఓ శాంకరీ!, తవ=నీయొక్క నవ=క్రొత్తవైన, కల్పవల్లీ=కల్పవృక్షము యొక్క పుష్ప=పువ్వులనుండి, ఉల్లసత్=ఎక్కువగా వ్యాపించు చున్న, బహుల=ఎక్కువైన, సౌరభ=పరిమళము వలన, లోభనీయమ్=ఆశించ దగినట్టిది, కల్యాణ= పరిణయసందర్భమున అలంకరింపబడిన, దామ=పూలదండయను, శశిఖణ్డమ్= చంద్రరేఖతో కూడినదియు, అఖణ్డ=ఎడతెఱిపిలేని (అవిచ్ఛిన్నమైన), శోభా= కాంతి చేత (అనగా ఆకర్షణతో కూడిన ధర్మము), కల్లోలితమ్=ఊగిసలాడినట్టిది, కల్యాణ= మంగళ కరమైన, కున్తల=కేశముల యొక్క భరమ్=సమూహము అనగా తలకట్టును, సంశ్రయామః=ఆశ్రయించుచున్నాము.

**భావము :** ఓ పార్వతీ! నీ కేశపాశము అప్పుడే వికసించిన కల్పలతల పూల నుండి నలువైపులా సువాసనలు వెదజల్లబడుచుండుటచే మిక్కిలి ఆకర్షణీయముగా నున్నది. వివాహమునందు అలంకరించు సమయమున చంద్రరేఖవలె పూలమాల నీ తలకట్టునందు అలంకరింపబడియున్నది. అది అంతులేని పలుసోయగములతో కూడియున్నది. అటువంటి నీ మంగళకరమైన కేశపాశమును ఆపదల నుండి ఉద్ధరింపబడుటకై ఆశ్రయించుచున్నాము.

విశేషము : శోభయనగా – "రూపయౌవనలాలిత్యభోగాద్యైరఙ్గభూషణం శోభా" అని లక్షణము. రూపము, యౌవనము, సుకుమారత్వము, భోగము మొదలగువాని వలన అంగములకు కలిగిన యందము శోభయని గలదు. ఇక్కడ భోగములనగా పూలదండలు, గంధము, తాంబూలములు మొదలగునవి. ప్రస్తుత వర్ణనమున పూలదండ వలన శోభ కలిగినట్లు వర్ణింపబడినది.

శ్లో॥ రింఛోలికా తవ శివే నిటలాలకానాం
న్యఞ్చత్పటీరతిలకే నిటలే విభాన్తీ।
మఞ్జుప్రసన్నముఖపద్మవిహారిలక్ష్మీ
పిఞ్ఛాతపత్రరుచిరా హృది నస్సమిన్ధామ్॥ 18

పదవిభాగము : రింఛోలికా, తవ, శివే, నిటలాలకానామ్, న్యఞ్చత్పటీరతిలకే, నిటలే, విభాన్తీ, మఞ్జుప్రసన్నముఖపద్మవిహారిలక్ష్మీపిఞ్ఛాతపత్రరుచిరా, హృది, నః, సమిన్ధామ్.

ప్రతిపదార్థము : శివే=ఓ మంగళకారిణీ! పార్వతీ!, తవ=నీయొక్క, న్యఞ్చత్=ప్రకాశించుచున్న, పటీర=మంచి గంధముయొక్క, తిలకే=బొట్టుగల, నిటలే=నుదుటి యందు, నిటల=ఫాల భాగమునందు పడుచున్న, విభాన్తీ=ప్రకాశించుచున్నట్టిదియు, మఞ్జు=సోయగముతో కూడినది, ప్రసన్న=నిర్మలమైనది అయిన, ముఖ=మోముయనెడి, పద్మ=తామరపువ్వునందు, విహారి=వేడుకగా తిరుగుచున్న, లక్ష్మీ=సొగసునకు (సొంపుయనులచ్చికి) ఏర్పఱుపబడిన, పిఞ్ఛ=నెమలిపురితో చేయబడిన, ఆతపత్ర=గొడుగుచే, రుచిరా=అందమైనట్టిదియునైన, నిటల=నుదురునందుపడు, అలకానామ్ =ముంగురుల యొక్క, రింఛోలికా=సమూహము, నః=మా యొక్క, హృది=మనస్సులో, సమిన్ధామ్=ఎక్కువగా ప్రకాశించుగాకయని ప్రార్థన.

భావము : ఓ సర్వమంగళా! నీవు గంధపుపొడితో నుదుట బొట్టును పెట్టుకొంటివి. అటువంటి నీ నుదుట ముంగురుల మొత్తము వెలుగొందుచున్నది. ముగ్ధమనోహరము, స్వచ్ఛమునైన నీ ముఖమను పద్మమునందు విహరించుచున్న లక్ష్మికి పైన నెమలి కన్నులతో కూర్చబడిన గొడుగువలె నీ కురులు మొత్తము ప్రకాశించుచున్నవి. అట్టిది మా యొక్క మనస్సులలో ప్రకాశించుగాక.

విశేషము : ఈ శ్లోకమున రూపకాలంకారము అందముగా కూర్చబడినది.

"సమిన్ధామ్". ఞి ఇన్ధీ దీప్తౌ అనునది ఆత్మనేపది. ఇది రుధాదిగణములోనిది. దీనికి లోట్ ప్రథమపురుషైకవచనము. ఇన్+ధ్+తే అనుచోట 'శ్నాన్నలోపః' అని శ్నమ్‌కు పరమైన నకారములోపింపగా 'శ్నసోరల్లోపః' అకారలోపము. ఝషస్తథోర్ధోధః అని ధత్వము. తరువాత జశ్త్వము వచ్చి ఇన్ధే కాగా 'ఆమేతః' అను సూత్రముచే ఇన్ధామ్ అని రూపమగును.

శ్లో॥ సమ్యగ్భ్రువౌ తవ విలాసభువౌ స్మరామః
సమ్ముగ్ధమన్మథశరాసనచారురూపే।
హృన్మధ్యగూఢనిహితం హరధైర్యలక్ష్యం
యన్మూలయన్త్రితకటాక్షశరైర్విభిన్నమ్॥ 19

**పదవిభాగము :** సమ్యక్, భ్రువౌ, తవ, విలాసభువౌ, స్మరామః, సమ్ముగ్ధమన్మథ శరాసనచారురూపే, హృన్మధ్యగూఢనిహితమ్, హరధైర్యలక్ష్యమ్, యన్మూలయన్త్రితకటాక్షశరైః , విభిన్నమ్.

**ప్రతిపదార్థము :** యత్=వేటియొక్క మూల=ముఖ్యకారణము అనగా వింటియొక్క నడిమి ప్రదేశమునందు, యన్త్రిత=స్థాపించబడి వదలబడిన, కటాక్ష=వాలుచూపులను, శరైః =బాణములచే, హృత్=మనస్సుయొక్క మధ్య=నడుమ (అంతరంగమందు), గూఢ= రహస్యముగా, నిహితమ్= దాచబడిన, హర=శంకరునియొక్క ధైర్య=బెట్టుదనము అను, లక్ష్యమ్=ఛేదింపదగిన గుర్తు, విభిన్నమ్=తుత్తునియలుగా చేయబడినదో, (తే=అటువంటి అనువద మధ్యాహార్యము) అటువంటి, తవ=నీయొక్క సమ్ముగ్ధ=బాగుగా అమాయకత్వముతో కూడిన, మన్మథ=కంతుని యొక్క శరాసన=విల్లువంటి, చారు= అందమైన, రూపే=ఆకారము గలట్టివి, విలాస=సొగసునకు, భువౌ= నెలవైనటువంటివి అయిన, భ్రువౌ=కనుబొమలను, సమ్యక్= లెస్సగా, స్మరామః=తలచుచుంటిమి.

**భావము :** తల్లీ! నీ కనుబొమలు అన్ని శృంగారవిలాసములకు ఆటపట్టైయున్నవి. అవి బేలతనముచే నించుకనందముగానున్న మన్మథుని విల్లువలె ఆకర్షణీయముగానున్నవి. శంకరుడు తన బెట్టుదనమును తన హృదయములో నెవ్వరికినీ తెలియకుండునట్లు రహస్యముగా దాచుకొనియున్నాడు. అట్టి ఛేదింపదగినది విల్లు మధ్యనుండి చక్కగా వదలబడిన అమ్ములవలె తీరిచిదిద్దినట్లున్న కనుబొమలతో కూడిన కన్నుల నుండి వెడలు చూపులచే త్రుంచబడినది. అట్టి నీ కనుబొమలనే బాగుగా ధ్యానము చేయుచున్నాము.

**విశేషము :** రూపకాలంకారము. 'విషయ్యభేదతాద్రూప్యరఞ్జనాద్విషయస్య యత్ రూపకమ్' అని లక్షణము. హరపదము వ్యంజకమగుటచే సర్వమును అనగా మృత్యువును సైతము హరింపగల అతని ధైర్యమునే నీవు చూపులతో చెల్లాచెదరు చేసితివనగా దేవి మహిమాతిశయము వ్యంగ్యమగుచున్నది. బయటగలదానిని ఛేదించుటకంటె దాగిన దానిని త్రుంచుట గొప్పగదా. యచ్ఛబ్దోపాదానే నపునస్తచ్ఛబ్దోపాదాననియమః అని కావ్యాలంకారసూత్రము. తచ్ఛబ్దమవసరము లేదు.

శ్లో॥ క్రమాస్సితాసితరుచా శ్రవణాన్తదీర్ఘాః
బిబ్బోకదమ్బరభృతో విభృతానుకమ్పాః।
సంపాతుకా మయి భవన్తు పినాకివక్త్ర
బిమ్బామ్బుజన్మమధుపాః సతి! తే కటాక్షాః॥ 20.

పదవిభాగము : కమ్రాః, సితాసితరుచాః, శ్రవణాన్తదీర్ఘాః, బిబ్బోకడమ్బరభృతః, విభృతానుకమ్పాః సంపాతుకాః మయి, భవన్తు, పినాకివక్త్రబిమ్బామ్బుజన్మమధుపాః, సతి, తే, కటాక్షాః.

ప్రతిపదార్థము : సతి=ఓ పతివ్రతామతల్లీ!, కమ్రాః=కమనీయమైనవి, సిత=తెల్లని, అసిత=నల్లని, రుచాః=కాంతిగలవి, శ్రవణ=చెవుల, అన్త=చివతివఅకు వ్యాపించుటచే, దీర్ఘాః=నిడుపైనవి, బిబ్బోక=ఇష్టమైన వస్తువునందును గర్వముచే చేయు బెట్టిదము యొక్క డమ్బర=ప్రదర్శించు డాబును, భృతః=ధరించునట్టివి, విభృత=ధరింపబడిన, అనుకమ్పాః =దయగలట్టివి, పినాకి=శంకరుని, వక్త్ర=మోముయొక్క, బిమ్బ=మండలమను, అమ్బుజన్మ =తామర పువ్వునందలి, మధుపాః=తుమ్మెదలైన, తే=నీయొక్క, కటాక్షాః=వాలుచూపులు, మయి= నాయందు, సంపాతుకాః=పడు స్వభావముగలవిగా, భవన్తు=అగుగాక.

భావము : ఓ సాధ్వీ! రమణీయములు, తెల్లని, నల్లని కాంతులతో గూడినవి, ఆకర్ణాంత విశాలములు, చూడదగినవానిని సైతము చూచుటలో అనాదరమును ప్రదర్శించునవి, మిక్కిలి దయాగుణముతో కూడినవి శివుని ముఖమును పద్మమునందెల్లవేళల తుమ్మెదలవలె సంచరించునవి అయిన నీ చూపులు ఎల్లప్పుడు నాయందు ప్రసరించుగాక.

విశేషము : చూపులను నల్లగను, తెల్లగను వర్ణించుట కవి సంప్రదాయము. బిబ్బోకము అనగా "బిబ్బోకస్త్వతిగర్వేణ వస్తునీష్టేఽప్యనాదరః" అని అలంకారికులు. ఎక్కువ బెట్టుచే చూడదగిన దానియందు సైతము తిరస్కారమును ప్రదర్శించుట. వక్త్రబింబమున పద్మధర్మమును, చూపులలో తుమ్మెదల ధర్మమునారోపించుటచే రూపకము. సితాసితయను పదముచే గంగాయమునలవలె నున్నవని అవి నాయందు పడుటచే గంగాయమునా సంగమ స్నాన ఫలము నిరంతరము సిద్ధింపవలెనను కవి యాశయము వ్యంగ్యము.

'సితాసితే తు యైస్స్నాతం మాఘమాసే యుధిష్ఠిర।
న తేషాం పునరావృత్తిః కల్పకోటిశతైరపి ॥" యని భవిష్యపురాణము.

కమ్రః–'కము కాన్తౌ' అను ధాతువుకు 'నమికమ్పిస్మ్యజసకమహింసదీపోరః' అని రప్రత్యయము. సంపాతుకః–పత ధాతువునకే తచ్ఛీలార్థమున 'లషపతపదస్థాభూవృషహనకమగమశ్రూభ్య ఉక ఞ్ అని ఉకఞ్' ప్రత్యయము.

శ్లో॥ లగ్నాభిరామమృగనాభివిచిత్రపత్త్రం
మగ్నం ప్రభాసముదయే తవ గణ్డబిమ్బమ్।
చిత్తే విభాతు సతతం మణికుణ్డలోద్య
ద్రత్నానుబిమ్బపరచుమ్బితమమ్బికే నః॥ 21

పదవిభాగము : లగ్నాభిరామమృగనాభివిచిత్రపత్త్రమ్, మగ్నమ్, ప్రభాసముదయే, తవ, గణ్డబిమ్బమ్, చిత్తే, విభాతు, సతతమ్, మణికుణ్డలోద్యద్రత్నానుబిమ్బపరచుమ్బితమ్, అమ్బికే, నః.

**ప్రతిపదార్థము :** అమ్బికే=ఓ జననీ!, తవ=నీయొక్క, లగ్న=పూయబడుటచే, అభిరామ= మిక్కిలి అందముగానున్న, మృగనాభి=కస్తూరిచే కూర్చబడిన, విచిత్రపత్త్రమ్=మకరిక మొదలగు పత్త్రరేఖలతో కూడినదియు, ప్రభా=కాంతియొక్క, సముదయే=మొత్తమునందు (వెల్లువ యందు), మగ్నమ్= మునిగినది, మణి=రత్నములతో కూడిన, కుణ్డల=చెవిపోగులనుండి, ఉద్యత్=ఉదయించు చున్న, రత్న=మణుల, అనుబిమ్బ= ప్రతిబింబముచే, పర=ఎక్కువగా, చుమ్బితమ్=ముద్దుపెట్టుకొన బడినదియు అయిన, గణ్డబిమ్బమ్=గుండ్రని చెక్కిలి, నః=మాయొక్క, చిత్తే=మనసునందు, సతతమ్= ఎల్లప్పుడు, విభాతు=ప్రకాశించుగాక.

**భావము :** అమ్మా! మనోహరమైన కస్తూరిచే రకరకములైన పత్త్రరేఖలు నీ కపోలమునందు శంకరునిచే గీయబడియున్నవి. అది కాంతి వెల్లువనందు మునిగియున్నది. నీ చెవి ప్రోగులలో పొదగబడిన రత్నముల ప్రతిబింబములు చెక్కిలిపై పడుచున్నవి. అట్టి నీ కపోలము నా మనస్సునందెల్లప్పుడును ప్రకాశించుగాక.

**విశేషము :** కపోలములందు కుండలముల రత్నముల ప్రతిబింబములున్నట్లు వర్ణించుటచే అద్దములవలెనున్నవని భావము. పద్మరాగములతో చేయబడిన అద్దమును సైతము అమ్మవారి కపోలములు తిరస్కరించుచున్నవియనగా అంతకంటె స్వచ్ఛములై ప్రతిబింబము నకనుకూలములను వ్యాసమహర్షి వర్ణనమును చూడుడు. "పద్మరాగశిలాదర్శపరిభావిక పోలభూః' (లలితాసహస్రము) కాంతల చెక్కిళ్ళపై శృంగారవిలాసముగా కాంతులు మొసలి మొ॥ బొమ్మలను సుగంధ ద్రవ్యములతో గీయుట సుప్రసిద్ధము. రాక్షసులను జయించి వారి కాంతల గండస్థలముల పత్రరేఖలు మాయునట్లు అజుడు చేసినట్లు కాళిదాస వర్ణనమును గాంచుడు.

"మహేన్ద్రమాస్థాయమహోక్షరూపం యస్సంయతి ప్రాప్తపినాకిలీలః
చకార బాణైరసురాఙ్గనానాం గణ్డస్థలీః ప్రోషితపత్రలేఖాః॥" (రఘు. 6-72)

అతిశయోక్త్యలంకారము.

శ్లో॥ స్థాణోస్సదా భగవతః ప్రియతానిధానం
ప్రాణాదపి ప్రవిరలస్మితలోభనీయమ్।
స్థానీకురుష్వ గిరిజే తవ బన్ధుజీవ
శ్రేణీసగన్ధమధరం ధిషణాన్తరే నః॥ 22

**పదవిభాగము :** స్థాణోః, సదా, భగవతః, ప్రియతానిధానమ్, ప్రాణాత్, అపి, ప్రవిరల స్మిత లోభనీయమ్, స్థానీకురుష్వ, గిరిజే, తవ, బన్ధుజీవశ్రేణీసగన్ధమ్, అధరమ్, ధిషణాన్తరే, నః.

**ప్రతిపదార్థము :** గిరిజే=ఓ పార్వతీ!, భగవతః=దైవమైనట్టి, స్థాణోః=శంకరునకు, సదా= ఎల్లప్పుడును, ప్రియతా=ప్రేముడికి, నిధానమ్=నెలవైనట్టిది, ప్రాణాత్=ప్రాణములకంటె,

అపి=కూడా, ప్రవిరల=ఎక్కువైన, స్మిత=చిఱునగవులచే, లోభనీయమ్= ఆశపడదగినది యును, బన్ధుజీవ=మంకెన పూవుల, శ్రేణీ=వరుసతో, సగన్ధమ్=సమానమైన, తవ=నీయొక్క అధరమ్= క్రిందిపెదవిని, నః=మాయొక్క, ధిషణా=బుద్ధియొక్క, అన్తరే=లోపల, స్థానీకురుష్వ=స్థానమును పొందినదానినిగా చేయుము.

**భావము :** ఓ పార్వతీ! పరదైవమైన శంకరుని ప్రేమకు ఆధారభూతమైనది, పలు చిఱునగవులతో కూడి యుండుటచే ప్రాణములకంటెనెక్కువగా ఆశపడదగినది, మంకెనపూల వరుసవలె నెఱ్ఱనైనది అట్టి నీ క్రింది పెదవిని మా మనసులలో ధ్యానము చేయుటకై స్థిరముగా నిలుపుము.

**విశేషము :** శంకరునకు స్థాణువనుపేరుండుటచే కవి దానిని వాడుటచే అచేతనమునైనను ఆకర్షించగలిగినదనునది వ్యంగ్యము. స్థాణువని శివునకు కాళిదాసును "సస్థాణుః స్థిరభక్తి యోగసులభః నిశ్శ్రేయసాయాస్తు వః" వాడినాడు (విక్రమో.) స్మితమనగా చిఱునవ్వు. సాహితీవేత్తలు. "ఈషద్వికాసినయనం స్మితం స్యాత్స్పన్దితాధరమ్" అని లక్షణమును చెప్పినారు (సాహి.ద.) సగన్ధమనగా సమానము. ఇందుకు కాళిదాసుని ప్రయోగము "సర్వస్సగన్ధేషు విశ్వసితి" (అభి.శా.) స్థానీకురుష్వ – అస్థానమును స్థానముగా చేయుట యనునర్థమున అభూత తద్భావమున చ్విప్రత్యయము చ్వౌచ అను సూత్రముచే దీర్ఘము.

**శ్లో॥** వన్దామహే కనకమఙ్గలసూత్రశోభా
సన్దీప్తకుఙ్కుమవలిత్రయభఙ్గరమ్యమ్।
మన్ద్రాధికస్వరవికస్వరనాదవిద్యా
సన్దర్భగర్భమగజే తవ కణ్ఠనాదమ్॥ **23**

**పదవిభాగము :** వన్దామహే, కనకమఙ్గలసూత్రశోభాసందీప్తకుఙ్కుమవలిత్రయభఙ్గరమ్యమ్, మన్ద్రాధికస్వరవికస్వరనాదవిద్యాసన్దర్భగర్భమ్, అగజే, తవ, కణ్ఠనాదమ్.

**ప్రతిపదార్థము :** అగజే=ఓ హిమంతుని కొమరితవైన పార్వతీ!, కనక=బంగారు, మఙ్గలసూత్ర= వివాహ వేళయందుంచబడిన కంఠసూత్రము యొక్క, శోభా=సోయగముచేత, సందీప్త=ఎక్కువగా ప్రకాశించిన, కుఙ్కుమ=కుంకుమపొడితో కూడిన, వలి=మెడయం దేర్పడిన గీతల, త్రయ=మూడింటి, భఙ్గ=విఱుపుచేత, రమ్యమ్=మనోహరమైనట్టిది, మన్ద్ర=తక్కువైన, అధిక= ఎక్కువైన, స్వర=స్వరము లతో, వికస్వర=విస్తరించిన, నాద=సంగీతమను, విద్యా=చదువు యొక్క, సన్దర్భమ్= ప్రసంగముతో కూడిన, తవ=నీ యొక్క కణ్ఠనాదమ్=కంఠస్వరమును, వన్దామహే=నమస్కరించుచున్నాము.

**భావము :** ఓ హిమవంతుని పుత్రికవైన పార్వతీ! నీవు బంగరపు మంగలసూత్రమును ధరించియుంటివి. దాని శోభచే కుంకుమము మఱింత యందముగానున్నది. మెడయందు గీతలవలెనేర్పడిన ముడుతలు నీవు సంగీతమాలపించునపుడు విఱుపుగా నేర్పడి మఱింత సొంపుగానున్నవి. అట్టి నీ కంఠమునందు తక్కువ, ఎక్కువగా పాటను బట్టి యేర్పడు

స్వరముల విస్తారముచే సంగీత విద్య సుసంగతమైనది. అట్టి నీ కంఠనాదమును నమస్కరించుచున్నాము.

**విశేషము :** అమ్మవారి కంఠమునగల మంగలసూత్రము యొక్క శోభచే ఆమె కంఠము ప్రకాశించుచుండునని వ్యాసుడు **"కామేశబద్ధమాఙ్గల్యసూత్రశోభితకన్ధరా"** అని లలితా సహస్రమున వర్ణించియున్నాడు. వన్దామహే! **"వది అభివాదనస్తుత్యోః"** అని ధాతువునకు నమస్కరించుట యర్థము. దీనిని లట్ (వర్తమానము)లో ఉత్తమపురుషబహువచనము **"కర్తరిశప్" "టిత ఆత్మనేపదానాం టేరే" "అతో దీర్ఘో యఞి" "ఇదితో నుమ్ ధాతోః"** అను సూత్రముచే ఈ రూపము సాధింపబడును.

> **శ్లో॥ రక్షార్థమత్ర మమ మూర్ధని ధత్స్వ నిత్యం**
> **దక్షారిగాఢపరిరమ్భరసానుకూలమ్।**
> **అక్షామహేమకటకాఙ్గదరత్నశోభం**
> **లక్షావిలం జనని పాణియుగం త్వదీయమ్॥ 24**

**పదవిభాగము:** రక్షార్థమ్, అత్ర, మమ, మూర్ధని, ధత్స్వ, నిత్యమ్, దక్షారిగాఢపరిరమ్భ రసానుకూలమ్, అక్షామహేమకటకాఙ్గదరత్నశోభమ్, లక్షావిలమ్, జనని, పాణియుగమ్, త్వదీయమ్.

**ప్రతిపదార్థము :** జనని=ఓ తల్లీ!, దక్ష=దక్షప్రజాపతికి, అరి=శత్రువైన శంకరుని, గాఢ=బిగి, పరిరమ్భ=కౌగిలింతయందలి, రస=ప్రీతికి, అనుకూలమ్=అనువైనది, అక్షామ=తక్కువకాని, హేమ=బంగారు, కటక=కంకణము, అఙ్గద=బాహువులయందలంకరించదగు భూషణముల యందలి, రత్న=మణుల యొక్క, శోభమ్=కాంతిగలది, లక్షా=పారాణి, ఆవిలమ్=గీతలు గల, త్వదీయమ్=నీదైన, పాణియుగమ్=రెండు చేతులను, రక్షార్థమ్=నన్ను కాపాడుటకై, అత్ర=నిన్ను స్తుతించు యీ సందర్భమున, మమ=నాయొక్క, మూర్ధని= శిరస్సుపై, నిత్యమ్=ఎల్లప్పుడును, ధత్స్వ=ఉంచుము.

**భావము :** ఈ శ్లోకమునందు కవి అమ్మవారి చేతులను వర్ణించుచున్నాడు. తల్లీ! నీ చేతులు శంకరుని ఆలింగనము చేసికొని ప్రీతినిపొందుటలో మిక్కిలి అనుకూలములైనవి. ఎక్కువ బంగారముతో అనగా రాగిపాలు ఎక్కువగానుండని మేలిమి అపరంజితో చేయబడిన కంకణములు, బాహువులయందలి అలంకారములతో పొదగబడిన మణుల కాంతులతో కూడియున్నది. ఇంతేగాక, మంగలకరమైన పారాణితో అలరారుచున్నవి. అట్టి నీ చేతులను నాకు బ్రహ్మజ్ఞానమును కలిగించి కాపాడుటకై నా తలపై ఎల్లప్పుడునుంచుము. అనగా శక్తి పాతముచే కైవల్యమును కలిగించుమని 'అహం బ్రహ్మాస్మి' అను స్ఫూర్తి నొసంగుమని ఋషి భావము.

**విశేషము :** ఆమె చేతులకు ఆభరణములు ధరించునని **"కనకాంగదకేయూరకమనీయ భుజాన్వితా'** అని వ్యాసుడు ఇట స్వభావోక్తి, భావము మొ॥ అలంకారములచే భక్తి ధ్వని

సూచితము. ధత్స్వ - "దు ధాఞ్ ధారణపోషణయోః" అను ధాతువునకు లోట్‌లో ఆత్మనేపదిలో మధ్యమపురుషైకవచనము. ఇది జుహోత్యాదిగణములోనిది. థాసఃసే అని రాగా ఏకారమునకు సవాభ్యాం వామౌ అని వత్వము. ఝషస్తథోశ్చ అని ధష్భావము.

క్షామః="క్షై క్షయే" అను ధాతువునకు నిష్ఠాప్రత్యయము పరముకాగా ఆదేచ ఉపదేశేఽశితి అని ఆత్వము, క్షాయోమః అని నిష్ఠాతకారమునకు మత్వము విహితములు.

శ్లో॥ జమ్భారికుమ్భివరకుమ్భనిభామురోజ
కుమ్భద్వయీం లలితసమ్భృతరత్నమాలామ్।
శమ్భోర్భుజైరనుదినం నిబిడాఙ్కపాలీ
సమ్భావితాం భువనసున్దరి! భావయామః॥ 25

**పదవిభాగము :** జమ్భారికుమ్భివరకుమ్భనిభామ్, ఉరోజకుమ్భద్వయీమ్, లలితసమ్భృత రత్నమాలామ్, శమ్భోః, భుజైః, అనుదినమ్, నిబిడాఙ్కపాలీసమ్భావితామ్, భువనసున్దరి, భావయామః

**ప్రతిపదార్థము :** భువనసున్దరి=ముల్లోకములు లేక పదునాలుగు లోకములయందును అందగత్తియవైనదానా!, జమ్భ=జమ్భుడను రక్కసునికి, అరి=శత్రువైనవాడు అనగా ఇంద్రుని యొక్క, కుమ్భి=ఏనుగులలో, వర=శ్రేష్ఠమైన ఐరావతము యొక్క, కుమ్భ=మూపు అనగా కుమ్భస్థలముతో, నిభామ్=సమానమైనట్టిది, లలిత=కోమలముగా (అనగా అందము చెదరనట్లుగా) సమ్భృత=అలంకరింపబడిన, రత్న=మణులయొక్క, మాలామ్= దండకలిగినట్టి, శమ్భోః=శివునియొక్క భుజైః=బాహువులచే, అనుదినమ్=ప్రతిదినమును, నిబిడ=బిగియైన, అఙ్కపాలీ=కౌగిలింతచే, సమ్భావితామ్=ప్రేమువిచే గౌరవింపబడిన, ఉరోజ=స్తనములను, కుమ్భ=కడవల, ద్వయీమ్=జంటను, భావయామః= భావించుచున్నాము.

**భావము :** ఓ అన్ని లోకములయందును సొగసైనదానా! దేవేంద్రుని వాహనమైన ఉచ్చైశ్శ్రవము యొక్క కుంభస్థలముతో సమానమైనట్టిది, సొగసైన రత్నముల దండతో నలకరించబడినది, ప్రతిదినము శివుని బాహువులచే అక్కున చేర్చుకొనబడి ఆదరింపబడినట్టిది అయిన వక్షస్థలమును భక్తితో భావన చేయుచున్నాము.

**విశేషము :** లోకమాత వర్ణనమున నిట్లు జెప్పుట యుచితమా? అని కొందఱు నాస్తికులడగ వచ్చును. వేంకటేశ్వర సుప్రభాతము(23) నందును ఇట్టి శృంగార భావము గలదని (లక్ష్మీ(కాంతా) కుచాంబురుహ కుట్మలలోలదృష్టే) భక్తి యిట్లన్నదని, దైవము లేనందున భక్తి వ్యర్థమని వారి భావము. కాని యిట గమనింపదగిన అంశములు గలవు. ఇది శృంగారరసము గాదు. విభావానుభావ సాత్త్విక సంచారాలు వ్యంగ్యములు కాలేదు. వానిచే రతి పోషింప బడలేదు. అసలు ఆ స్థాయి భావమిచటలేదు. రసనిష్పత్తి లేనందుననిది శృంగారము కాదని వారు గమనించలేదు. ఇది భావము మాత్రమే. ఇది ప్రబంధవ్యాప్తియైన

భక్తిభావధ్వనికంగము. ఇట్టి అంగాంగిభావమును గుర్తింపలేక నాక్షేపించరాదు. శిల్పికి శిల్పము చెక్కునపుడును, చిత్రకారునికి బొమ్మ గీయునపుడును శృంగారభావముండదు. కేవలము బొమ్మను తమ బిడ్డగా భావించి తీర్చిదిద్దుదురు. ప్రపంచములో అన్నింటికంటె శ్రేష్ఠమైనది దైవతేజస్సు - రూపము. దానిని నిర్దుష్టముగా వర్ణింపవలయును. శిల్పము చెక్కునపుడు ఏ అవయవము ఎంతకొలతలో, ఎట్లుండవలయునో శిల్పశాస్త్రము చెప్పును. అట్లే నిర్దుష్టముగా చెక్కవలయును. దోషము అణుమాత్రమైనను ఉండరాదు. అట్టి శిల్పము దేవాలయమున ప్రతిష్ఠింపబడినపుడు దైవశక్తి కలుగును. పగిలిన, విరిగిన, కొలతలు సరిలేని విగ్రహమును పూజించిన దేశమునకు, వ్యక్తికి నరిష్టము కలుగును. కావున దేవతావిగ్రహమువలె జగన్మాత స్వరూపము శాస్త్రబద్ధముగా నుండును. అట్లే వర్ణింపవలయును. కావున కవులును చక్కని రూపములను అట్లే వర్ణింతురు. కాళిదాసు 'వ్యూఢో రస్కో వృషస్కన్ధః సాలప్రాంశుర్మహాభుజః' అని దిలీపుని, వాల్మీకి 'సమస్సమవిభక్తాఙ్గః', 'త్రిషూన్నతః, త్రిషు స్థిరః' మొదలగు పదములతోను అనేక పర్యాయములు రాముని వర్ణించెను.

కవిత్వమునందును మహాకవులు చిత్రములను గీయుదురు. కాళిదాసు పలుమాఱులు తన శాకుంతల, కుమారసంభవాదులలో బొమ్మ కనులకు కట్టినట్లుగా చిత్రములను గీసినాడు. అధునికులు కుమారసంభవములోని హిమాలయ వర్ణనములకు తగినట్లు చక్కగా బొమ్మలను గీసి డైరీలను కూడా ప్రచురించి లోకమునానందింపజేసిరి. గుణవంతుడైన వైద్యునికి శస్త్రచికిత్సలో శృంగారభావముండదని అందఱు చెప్పుదురు. కవి సంప్రదాయములలో వానినట్లు వర్ణింపవలయునని శాస్త్రకారులు జెప్పిరి. వానినట్లే వర్ణించుట కవి సంప్రదాయము. సంప్రదాయములేని కవి ప్రశంసార్హుడు కాడు. సంస్కృతమున ప్రాసనియమము లేకున్నను మహాముని ప్రాసను వాడెను. ఇట్టి ప్రాస ఇంతకుముందు శ్లోకములలోను, తరువాత శ్లోకములయందును గోచరించును. చాలాచోట్ల దుష్కరప్రాసములను అవలీలగా వాడెను. ప్రాసనియమములు తెనుగునుండి సంస్కృతమున ప్రవేశించినది కాదు. ఆంధ్ర వాఙ్మయము ఎదుగుటకు ముందే వేల సంవత్సరముల క్రిందటనే సంస్కృత కవులకు ప్రాస తెలియును. సరళత కొఱకు దానిని ఛందశ్శాస్త్రములలో నియమముగా చెప్పలేదు. ఛందస్సులో ప్రాసనియమము లేకున్నను చమత్కారముగా వాడిన కవులు కొందఱు గలరు. మూకమహాకవి మూకపఞ్చశతిలో చాలా సుకరముగా ప్రాసను తన యిష్టముతో వాడినాడు. చూడుడు.

> **"రాకాచన్ద్రసమానకాన్తివదనా నాకాధిరాజస్తుతా**
> **మూకానామపి కుర్వతీ సురధునీనీకాశవాగ్వైభవమ్।**
> **శ్రీకాఞ్చీనగరీవిహారరసికా శోకాపహన్త్రీ సతా**
> **మేకా పుణ్యపరమ్పరా పశుపతే రాకారిణీ రాజతే"॥** - స్తుతిశతకమ్ - 11

అఙ్కపాలీయనగా కౌగిలింతయని యర్థము.

'అజ్కపాలిర్ద్వారికాయాం కోటావాలిజ్జనేఽపి సా' అని నానార్థరత్నమాల.

అక్షరము కష్టమగుటచే దానిని ప్రాసగా వాడుట మతింత కష్టముగావున నిది దుష్కర ప్రాసము. దుష్కరప్రాసమనగా నిట్లుండును –

**"దోఃకీలితమణికటకయు-రఃకలితరమాభిరామరంజిత సుజనాం**
**తఃకరణఖండితారిశి-రఃకందుకయనంగ దుష్కరప్రాసమగున్'** (ఛందోదర్పణము)

దుష్కరప్రాసమేగాక "మ్బ" అనునక్షరము పలు తేపలు ఆవృత్తమగుటచే అనుప్రాసము గలదు. భువనమ్-భవన్త్యుత్పద్యన్త ఇతి భువనాని। భూసూధూభ్రస్జిభ్యశ్ఛన్దసి' (2-81) అని ఔణాదికమైన క్యున్ ప్రత్యయము. బ్రహ్మమునుండి పుట్టినయన్నింటిలో సుందరియని సూచితము.

భువనసున్దరి అను పదముచే దశమహావిద్యలలో సున్దరియనిగాని, భువనేశ్వరియనిగాని గ్రహింపవచ్చును. ఈ రెండును ఒకశక్తి భాగములే. అండశరీరమున, బ్రహ్మాండ శరీరమునను ప్రాణుల సారాంశమైన శుద్ధప్రజ్ఞ సుందరి. విషయదశలో విషయాకారముతోనున్న ఆకాశాకార శక్తి భువనేశ్వరి. "పిణ్డే చాణ్డే జఙ్గమపారః శుద్ధా ప్రజ్ఞా సున్దర్యుక్తా, విషయదశాయాం దేశీభూతా సేయం, భువనేశ్వర్యాఖ్యాతా" అని ఉమాసహస్రము (10-2-12). విషయాకారతాయాం ఆకాశదేశగా భువనేశ్వరీ అని కపాలిశాస్త్రి వ్యాఖ్య. 'భువనసున్దరి' అను పదము సామాన్యముగాక విశేషముతో కూడినది. అన్ని లోకములలోను సుందరివి గావుననే భావించుచున్నామని హేతుగర్భితము. విశేషణము సాభిప్రాయమగుటచే పరికరాలంకారము. "అలఙ్కారః పరికరః సాభిప్రాయే విశేషణే" కుమ్భనిభాం అనుచోట ఉపమాలంకారము.

**'స్వతస్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః'**
**'సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకదోపమా'** అని లక్షణము.

ఉపమా, రూపకములు, అనుప్రాసయు కలసి అలంకారసంసృష్టియైనది. వక్షస్సును ఐరావతకుంభముతో పోల్చుటచే సిందూరము మొ॥ వానిచే అది అలంకరింపబడినదను వ్యంగ్యము గలదు. ఐరావతకుంభస్థలము కుంకుమ, సిందూరము మొదలగువానిచే అలంకరింపబడుట ప్రసిద్ధము. ఇందుకు మయూరుని వర్ణనము చూడుడు.

**జమ్భారాతీభకుమ్భోద్భవమివ దధతస్సాన్ద్రసిన్దూరరేణుం**
**రక్తాస్సిక్తా ఇవౌఘైరుదయగిరితటీ ధాతుధారాద్రవస్య।**
**ఆయాన్త్యా తుల్యకాలం కమలవనరుచే వారుణా వో విభూత్యై**
**భూయాసుర్భాసయన్తో భువనమభినవా భానవో భానవీయాః॥** (సూర్యశతకము-1)

ఇది అనుప్రాసకునుదాహరణయే. భకారావృత్తిని చూడుడు. ఇట్లే "జలోన్మజ్జద్దైరావతో ద్దానకుమ్భస్ఫురత్ప్రస్థలత్సాన్ద్రసిన్దూరరామే" (గంగాష్టక స్తోత్రము-6) అనియు ఇందుకు పోద్బలకముగానున్నది. స్త్రీలు వక్షస్థలమును కుంకుమతో

నలంకరింతురు. 'నవారయామాస నృపస్నుషాయాః-స్వాసైర్ధరన్యాః కుచకుఙ్కుమాని' అని భారత ప్రయోగము. హస్తికుమ్భోత్తుఙ్గకుచా అని త్రిశతి.

శ్లో॥ గర్వాపహే వటదలస్య తనూదరాన్తే
నిర్వ్యూఢభాసి తవ నాభిసరస్యగాధే।
శర్వావలోకరుచిమేదురరోమవల్లీ
నిర్వాసితే వసతు మే ధిషణామరాలీ॥ 26

**పదవిభాగము :** గర్వాపహే, వటదలస్య, తనూదరాన్తే, నిర్వ్యూఢభాసి, తవ, నాభిసరసి, అగాధే, శర్వావలోకరుచిమేదురరోమవల్లీనిర్వాసితే, వసతు, మే, ధిషణామరాలీ.

**ప్రతిపదార్థము :** తను=పలుచనైన, ఉదర=కడుపుయొక్క, అన్తే=చివఱగల, వట=మఱ్ఱి చెట్టు యొక్క దలస్య=ఆకుయొక్క, గర్వాపహే=బెట్టును తొలగించునట్టి, నిర్వ్యూఢ=చక్కగా సృష్టింప బడుటచేత, భాసి=ప్రకాశించుచున్న, అగాధే=లోతుగల, శర్వ=శంకరుని, అవలోక=చూపు నందలి, రుచి=కాంతిచేత, మేదుర=దట్టముగా వ్యాపించిన, రోమవల్లీ= పూలతీగవంటి నూగారు చేత, నిర్వాసితే=వెడలగొట్టబడిన, తవ=నీయొక్క, నాభి= బొడ్డుయను, సరసి=కొలను యందు, మే=నాయొక్క, ధిషణా=బుద్ధియను, మరాలీ= ఆడుయంచ, వసతు=నివసించుగాక.

**భావము :** మఱ్ఱియాకువలె సొగసుగానున్నట్టి, కృశోదరము చివఱగల, చక్కగా నిర్మింప బడుటచే కాంతివంతమైన, లోతైనట్టి, శంకరుని చూపుల కాంతిచే మఱింత దట్టముగానున్న నూగారు క్రిందగల నాభియను సరోవరమునందు నా బుద్ధియను హంస నివసించుగాక.

**విశేషము :** నాభిసరసి, రోమవల్లీ, ధిషణామరాలీ పదములయందు రూపకము. తృతీయ పాదమున అతిశయోక్తియు గలవు.

నాభిని నీటిసుడితోను, చెట్టుపాదుతోను పోల్చుదురు. కాళిదాసు 'నృపం తమావర్తమనోజ్ఞ నాభిః' (రఘువంశము) అనియు, దండిమహాకవి "గమ్భీరావర్తనాభిర్నాభిః" (దశకుమార చరిత్రము) అని ఇందుమతీ వసుమతులను వర్ణించిరి. **'నాభ్యాలవాల రోమాలిలతాఫలకుచద్వయీ'** అని వ్యాసుని వర్ణనము (లలితాసహస్ర నామము). ధిషణామరాలీయను రూపకముచే హంసకువలె నా బుద్ధికి వివేకము గలదని సూచితమై తద్ద్వారా కావుననే నీ సేవ చేయుచుంటినను వస్తుధ్వని. **"ఞిమిదా స్నేహనే"** అను ధాతువుకంటే తచ్ఛీలమున **"భఞ్జభాసమిదో ఘురచ్"** అని ఘురచ్ కృత్ ప్రత్యయము. (3-2-161) "మేఘైర్మేదురమమ్బరమ్" అని జయదేవ ప్రయోగము.

శ్లో॥ మచ్చేతసి స్ఫురతు మారరయాఙ్గభఙ్గీ
ముచ్చైర్దధానమతిపీవరతానిధానమ్।
స్వచ్ఛన్దరత్నరశనాకలితాన్తరీయ
ప్రచ్ఛన్నమమ్బ! తవ కమ్రనితమ్బబిమ్బమ్॥ 27

**పదవిభాగము :** మచ్చేతసి, స్ఫురతు, మారరయాఙ్గభఙ్గీమ్, ఉచ్చైః, దధానమ్, అతిపీవరతానిధానమ్, స్వచ్ఛన్దరత్నరశనాకలితాన్తరీయప్రచ్ఛన్నమ్, అమ్బ, తవ, క్రమనితమ్బబిమ్బమ్.

**ప్రతిపదార్థము :** అమ్బ=ఓ తల్లీ!, మార=మన్మథుని యొక్క, రయ=వేగముచే అనగా శరీరమంతను వ్యాపించిన యౌవనవిలాసముల వేగముచే, అఙ్గ=శరీరమందేర్పడిన, భఙ్గీమ్=విఱుపును, ఉచ్చైః=మిక్కిలిగా, దధానమ్=ధరించుచున్నట్టి, అతి=ఎక్కువైన, పీవరతా=బలియుటకు, నిధానమ్= నెలవైనదియు, స్వచ్ఛన్ద=స్వేచ్ఛగా కూర్చబడిన అనగా ఒకే వరుసగాక అందమినుమడించునట్లుగా ఆలోచించి ఒకదానివెంట నొకటిగా స్వేచ్ఛగా కూర్చబడిన, రత్న=రత్నముల, రశనా= వడ్డాణముచే, కలిత=ఒప్పారుచున్న , అన్తరీయ= (బిగించి కట్టబడిన) నడుమునకు కట్టిన వస్త్రముచే, ప్రచ్ఛన్నమ్= కప్పబడిన, తవ=నీయొక్క, క్రమ=అందమైన, నితమ్బ=జఘనమను, బిమ్బమ్=మండలము, మచ్చేతసి= నా మనస్సులో, స్ఫురతు=ప్రకాశించు గాక.

**భావము :** ఓ తల్లీ! యౌవనవిలాసముచే నీ శరీరమున నేర్పడినది, బలిష్ఠముగానున్నది, రత్నాల వడ్డాణముచే నడుమునకు బిగించికట్టబడిన వస్త్రముచే కప్పబడిన మనోహరమైన నీ నితంబము నా మనస్సులో ప్రకాశించుగాక.

**విశేషము :** స్వభావోక్తి, అనుప్రాసాలంకారములు. అమ్బా అనునది ఆకారాన్తశబ్దమైనను "అమ్బార్థనద్యోర్హ్రస్వః" అని హ్రస్వము. సంబోధనతో విధించబడుటచే అమ్బయనియగును.

**శ్లో॥ స్యన్దానురాగనుదవారిపురారిచేతః**
**సన్నాగబన్ధమణువేణుకమూరుకాణ్డమ్।**
**వన్దీకృతేన్ద్రగజపుష్కరముగ్ధరమ్భం**
**నన్దామ సున్దరి! శివే! హృది సన్దధానాః॥ 28**

**పదవిభాగము :** స్యన్దానురాగమదవారిపురారిచేతస్సన్నాగబన్ధమణివేణుకమ్, ఊరుకాణ్డమ్, వన్దీకృతేన్ద్రగజ పుష్కరముగ్ధరమ్భం, నన్దామ, సున్దరి, శివే, హృది, సన్దధానాః.

**ప్రతిపదార్థము :** సున్దరి=ఓ త్రిపురసున్దరీ!, శివే=ఓ శివపత్ని! (మంగళకారిణీ-మంగళగౌరీ!) స్యన్ద=కాఱిన ద్రవమువలెనున్న, అనురాగ=ప్రేమయను, మద=మదమను పేరుగల, వారి= జలముగల, పురారి=శంకరుని, చేతః=హృదయమను, సన్నాగ=మంచి ఏనుగును, బన్ధమ్= కట్టివేయునట్టి, అణు=నిపుణమైన, వేణుకమ్=కట్టుకొయ్య ఐన, వన్దీకృత= వందిమాగధులుగా చేయబడిన, ఇన్ద్ర=దేవేంద్రుని, గజ=ఏనుగు అయిన ఐరావతము యొక్క పుష్కర=తొండము యొక్క చివఱి భాగమును, ముగ్ధ=మోహనమైన, రమ్భమ్=అరటి చెట్టునుగల లేదా, ముగ్ధ= అందమైన, లేదా ముగ్ధనాయిక అయిన, రమ్భమ్=రంభయను అచ్చరగల, ఊరు=తొడల, కాణ్డమ్=సమూహమును (శివే=మంగళ కరమైన), హృది=నా మనస్సునందు, సన్దధానాః=భావించుకొనుచున్నవారమై, నన్దామ=సంతోషించుదము గాక.

**భావము :** ఈ శ్లోకమున ముని దేవతయొక్క ఊరువులను వర్ణించుచున్నాడు. శంకరుని మనస్సులో శాంకరిపైగల ప్రేమయే మదజలముకాగా, శంకరుని మనస్సే ఏనుగు. దానిని ఈమె ఊరువులు బంధించుచుండును. ఇంతియుగాక, ఇంద్రుని ఐరావతమను ఏనుగు యొక్క తొండము చివఱ, మఱియు మనోహరమైన అరటిచెట్టు లేదా దేవలోకమున గల రంభయనునప్సరసలను వందిమాగధులుగా చేయును. అవి ఊరువులను స్తుతించు చుండును. అట్టి ఊరువులను మా మనస్సులో ధ్యానించుచూ సంతోషించుదముగాక.

**విశేషము :** అంగాగిరూపకాలంకారము అనుప్రాస సామాన్యము. ఊరువులను ఏనుగు తొండములతోను, అరటిబోదెలతోను పోల్చుదురు. కవి యట్లే వర్ణించెను. కాళిదాసుని వర్ణనము చూడుడు.

నాగేన్ద్రహస్తాస్త్వచి కర్కశత్వాదేకాన్తశైత్యాత్కదలీవిశేషాః।
లబ్ధ్వా హి లోకే పరిణాహి రూపం జాతాస్తదూర్వోరుపమానబాహ్యాః॥

రమ్భాయనగా అరటిచెట్టు. "రమ్భామోచాంశుమత్ఫలా" అని అమరము. ఇట అరటి చెట్టని చెప్పుట వర్ణనకనుకూలమే. కాని ఇంద్రుని ఐరావతము దైవాంశగలది. కావున స్తోత్రము చేయగలదు. దానితో కేవలము మానవ లోకమందలి జడమైన అరటిచెట్టును చేర్చినచో అది ఎట్లు స్తోత్రము చేయును? అనగా లక్షణావృత్తిచే సమన్వయము కుదురును. కాని రంభయనగా అప్సరసయన్నచో అమెయు దేవస్త్రీగావున ఐరావతముతో ప్రక్కన నిలబడుట కవకాశముండును. రంభయు దేవసౌందర్యముతో కూడిన దేవి అవయవమును స్తోత్రము చేయుట సమంజసమేయగును. ఏదిఏమైనను రెండు విధముల బాధ లేదు. మామూలు ఏనుగును చెప్పక దేవగజమును గ్రహించుటచే రంభయనునప్సరస. పుష్కరమనగా ఏనుగు తొండము కొన "పుష్కరం కరిహస్తాగ్రే" అని కోశము. బన్దీకృతయను పాఠమున వానిని బంధించినయనగా జయించినయని అర్థము. నన్దామ "టునది సమృద్ధౌ" అను ధాతువునకు "ఇదితో నుమ్‌ధాతోః" అని 'నుమ్'రాగా లోట్ ఉత్తమ పురుషబహువచనమున "ఆని లోట్" "ఆడుత్తమస్యపిచ్చ" అను సూత్రముల ప్రవృత్తిచే రూపమేర్పడును. ముగ్ధరమ్భమనుచోట "స్త్రియాః పుంవద్భాషిత పుంస్కాదనూఙ్‌సమానాధికరణే స్త్రియామపూరణౌ ప్రియాదిషు" అని పుంవద్భావము. వైణుకమ్ (కుమార సంభవము) "తోత్రం వైణుకమాలానం భన్ధస్తమ్భే" అని కోశము. ఏనుగును కట్టు స్తంభము. వేణుకమ్ అను పాఠమున "ప్రతోదం వేణుకం తథా" అని పర్యాయ శబ్దరత్నము. అణు అనగా నిపుణమైనది. "అణుకో నిపుణే స్వల్పే" అని ధరణికోశము.

శ్లో॥ ముగ్ధోల్లసత్కనకనూపురబద్ధనానారత్నా
భయోర్ధ్వగతయా పరితోఽభిరామమ్।
చిత్తప్రసూతిజయకాహలకాన్తిజఙ్ఘా
యుగ్మం త్వదీయమగనన్దిని చిన్తయామః॥ 29

**పదవిభాగము :** ముగ్ధోల్లసత్కనకనూపురబద్ధనానారత్నాభయా, ఊర్ధ్వగతయా, పరితః, అభిరామమ్, చిత్తప్రసూతిజయకాహలకాన్తిజఙ్ఘాయుగ్మమ్, త్వదీయమ్, అగనన్దిని, చిన్తయామః

**ప్రతిపదార్థము :** అగనన్దిని=కొండకూతురువైన ఓ పార్వతీ! లేదా అగ=పర్వతమైన హిమవంతుని, నన్దిని=నీ నడవడి, తపశ్శక్తిచే సంతోషపెట్టినదానా! ఊర్ధ్వ=పైకి, గతయా=ప్రసరించినట్టి, ముగ్ధ= మనోహరమై, ఉల్లసత్=ప్రకాశించుచున్న, కనక=బంగారు, నూపుర=కాలియందెలయందు, బద్ధ=బిగించబడిన, నానా=పలురకములైన, రత్న=మణుల, ఆభయా=కాంతిచే, పరితః=నలువైపుల, అభిరామమ్=మనోహరమైనట్టి, త్వదీయమ్=నీదైన, చిత్త=మనస్సుతో, ప్రసూతి=పుట్టుకగల అనగా మన్మథుని, జయ=గెలుచుట వలన, కాహల=గెలుపునుసూచించుటకై ఊదబడు బూరయొక్క, కాన్తి= వెలుగుతో కూడిన, జఙ్ఘా= కాలిపిక్కల, యుగ్మమ్=జంటను, చిన్తయామః=భావించుచున్నాను.

**భావము :** ఓ పార్వతీ! నీవు కాలియందెలను ధరించినావు. ఆ అందెలు మనోజ్ఞమై కాంతితో కూడినవి. వాటియందు రకరకములైన మణులు కూర్చబడినవి. వాటివెలుగు పైకి ప్రసరించుచుండును. అందువలన నలువైపులును అందముగా నుండును. అవి మన్మథుని గెలుచుటచే ఊదుబూరల కాంతితో నుండును. అట్టి నీ కాలి పిక్కలను భావించుచున్నాను.

**విశేషము :** ఇట ముగ్ధ, ఉల్లసత్ అను రెండు పదములను వాడుటచే అవి అందముగను, కాంతివంతముగను ఉన్నవని అర్థము. అందముగా నున్నను కొన్నింటికి కాంతియుండదు. కొన్ని ఎక్కువ కాంతితో నున్నను అందముగా నుండవు. వీటియందు రెండును ఉన్నవి. బూరల కాంతియని అన్యధర్మారోపముచే నిదర్శనాలంకారము. ఈ అలంకారమును "శ్రితోదయాద్రేరభిసాయముచ్చకైరచూచు రచ్చన్ద్రమసోఽభిరామతామ్" అని మాఘుడు చక్కగా వాడినాడు.

శ్లో॥ ఖట్వాఙ్గపాణిమకుటేన తదా తదా సం
ఘృష్టాగ్రయోః ప్రణతిషు ప్రణయప్రకోపే ।
అష్టాఙ్గపాతసహితం ప్రణతోఽస్మి లబ్ధుం
ఇష్టాం గతిం జనని పాదపయోజయోస్తే ॥ 30

**పదవిభాగము :** ఖట్వాఙ్గపాణిమకుటేన, తదా తదా, సంఘృష్టాగ్రయోః, ప్రణతిషు, ప్రణయప్రకోపే, అష్టాఙ్గపాతసహితమ్, ప్రణతః, అస్మి, లబ్ధుమ్, ఇష్టామ్, గతిమ్, జనని, పాదపయోజయోః, తే.

**ప్రతిపదార్థము :** జనని=తల్లీ! ఖట్వాఙ్గపాణి=ఖట్వాంగము అనుపేరుగల ఒక ఆయుధము చేతియందు గలవాడు అయిన శంకరుని (ఖట్వాంగమనగా శివునివింటికి పేరు) మకుటేన=కిరీటముతో, ప్రణయ=శృంగారమున కలుగు, ప్రకోపే=కినుకలయందు

(పొలయలుకలయందు), ప్రణతిషు=పాద నమస్కారముల యందు, తదా తదా= అప్పుడప్పుడు, సంఘృష్టాగ్రయోః=రాయిడిగల కొనలు గల, తే=నీయొక్క పాద= అడుగులను, పయోజయోః=తామరపువ్వులకు (అనగా వానియెదుట) ఇష్టామ్=నా యిచ్చవచ్చిన, గతిమ్=స్థానమును, లబ్ధుమ్=పొందుటకు, అష్టాఙ్గ=ఎనిమిది అవయవముల, పాత=పాటుతో, సహితమ్=కూడినట్లుగా, ప్రణతః=నమస్కరించినవానిగా, అస్మి= అగుచున్నాను.

**భావము :** ఓ తల్లీ! అప్పుడప్పుడు నీ భర్తతో కూడిన సింగారములయందు పొలయలుకలు ఏర్పడినపుడు శంకరుడు కిరీటముతో కూడిన తన శిరస్సును వంచి నీపాదములకు నమస్కరించినపుడు నీ అడుగులకు కిరీటపు యంచులు తగులుటచే సుకుమారములైన ఆ పాదములు నొచ్చి కందిపోవును. అట్టి నీ పాదపద్మములయెదుట నేను కోరిన స్థానమును పొందుటకై సాష్టాంగనమస్కారమును చేయుచున్నాను.

**విశేషము :** చేత వింటిని ధరించి, రాజచిహ్నమును ధరించి, ముల్లోకములకు ఆరాధ్యుడైన శంకరుడే రాజచిహ్నముతో కూడిన తలవంచి నీ పాదములకు నమస్కరించుచుండగా నావంటివాడు సాష్టాంగ పడకపోవుటయెట్లు అను వ్యంగ్యమున్నది. కావున అర్థాపత్తి అలంకారము వ్యంగ్యమనవచ్చును. ప్రణతిషు అని బహువచన స్వారస్యముచే దేవీ మహిమ అధికమని వ్యంగ్యము. ప్రయను ఉపసర్గను వాడుటచే ఆ సింగారపుటలుక సాధారణమైన లాలింపుతో పోదనియు, నమస్కారమే దానికి తగిన యుపాయమని సూచితము. ఈ సందర్భమున మహాకవులు వాక్యములు, పదములు గాక కేవల ప్రకృతి, కేవల ప్రత్యయములగు పదైకదేశము చేతను వ్యంగ్యార్థమును వ్యంజింపచేయగలరను ఆనందవర్ధనుని మాట మఱువరానిది.

**అష్టాంగనమస్కారము :** దేవతలకు, గురువులకు సాష్టాంగనమస్కారమును చేయవలయును. సాష్టాంగనమస్కారము అనగా చేతులు, పాదములు మొదలగు శరీరమందలి ఎనిమిది అవయవములు నేలకు తగులునట్లు దేవి ముందు బోర్లాపడి నమస్కారము చేయుట. ప్రణతయనుటచే అత్యంత వినయముతో నేను నీ వాడనని శరణాగతిని పొందితినని అర్థము సూచితమగుచున్నది. ఇష్టమైన గతిని పొందుటకనగా 'తత్త్వమస్యా'ది మహావాక్యార్థ బోధానుభూతితో దేవితో నైక్యమును పొంది అద్వైతము పొంది మోక్ష సామ్రాజ్యమునొందుటకని భావము.

శంకరుడంతటివాడు ఇట్లు దేవియెదుట మోకరిల్లుట దోషము గాదు. కావ్యమున నాతడొక నాయకుడు మాత్రమే. శృంగారమున నాయకునీ రీతిగా వర్ణించుట రసానుకూలముగావున అనౌచిత్యము గాదు. పారిజాతాపహరణమున నందితిమ్మన వర్ణించిన విధము చూడుడు :

'పాటలగంధి చిత్తమునఁబాటిలు కోపభరంబు మాన్ప నె
ప్పాటున ఁబాటుగామి, మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతిమౌళిమణిపంక్తికి వన్నియవెట్ట నా జగ
న్నాటక సూత్రధారి యదునందనుఁడర్మిలి మ్రొక్కి, మ్రొక్కినన్' 1.ఆ.120ప

కుమారసంభవమున మన్మథునిచే ఇంద్రుని గూర్చి కాళిదాసు ఇట్లనిపించెను.
'కయాసికామిన్ సురతాపరాధాత్-పాదానతః కోపనయాఽవధూతః?' 3స.

దుర్వాసోముని శాక్తేయుడు, లలితాభక్తుడు. కావున శక్తి ప్రాధాన్యమును నిరూపించుటకే ఇట్లు వర్ణించినాడు. శక్తికి, శివునకు సంబంధము జాబిల్లికి, వెన్నెలకు గల సంబంధము వంటిదని, శివుడు శక్తి లేనిచో కొఱగాడని, అన్ని తంత్రములును ఘోషించుచున్నవి. ఈ విషయమున అనేక ప్రమాణములు చూపవచ్చును గాని అవి మూలమునకు దూరమై అతి విస్తృతిని కలిగించును. క్లుప్తముగా శక్తి లేని శంకరుడు ఏమియూ చేయలేడనుటకు శంకరాచార్యుల ఒక్కమాటను చెప్పుకొందము.

"శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలః స్పన్దితుమపి ।
అతస్త్వామారాధ్యాం హరిహరవిరిఞ్చాదిభిరపి
ప్రణన్తుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి ॥" (సౌందర్యలహరి)

ఖట్వాంగమనగా మంచపుకోడువంటి ఒకానొక యాయుధము. ముకుటమను సంస్కృత పదమునకు 'అన్ముకుటాదిషు' అను ప్రాకృతసూత్రముచే ప్రాకృతమున అత్వము విధింపబడినది. సంస్కృతమున అత్వమెట్లనగా, మకుటశబ్దమును ద్విరూపకోశమున గలదు. తదా అను అవ్యయమునకు వీప్సయందు ద్విరుక్తి. సర్వస్యద్వే అను అధికారము క్రింద 'నిత్యవీప్సయోః' అను సూత్రముచే ద్విరుక్తి.

కాళిదాసుని ప్రయోగము - 'దినేదినే సా పరివర్ధమానా'. 'ప్ర అను అక్షరము ఆవృత్తమగుటచే అనుప్రాసాలంకారము-ప్రాసనియమము సంస్కృతమున లేకుండుటచే ఇట ప్రాసవివక్ష లేదు. శక్తిని విడచి యితర దేవతలను సేవించుట వ్యర్థము. దప్పిక కలిగినపుడు గంగానదిని విడచి ఎండమావులవెంటపడుట వంటిది" చూడుడు-

"గంగాం విహాయ తృప్త్యర్థం మరువారి యథా వ్రజేత్
విహాయ దేవీం తద్భిన్నాం తథా దేవాన్తరం వ్రజేత్" - తిలక వ్యాఖ్య

ఔచిత్యము : ఇటముని సాష్టాంగప్రణామము నాచరించెను. శక్తినీడను, గురువునీడను, దేవతల నీడను దాటరాదు. సాష్టాంగప్రణామము చేయవలెను. ముమ్మారు ప్రదక్షిణమును చేయవలెనని దీక్షాప్రకాశికాగ్రంథము తెలుపుచున్నది. చూడుడు-

"శక్తిచ్ఛాయాం గురుచ్ఛాయాం దేవచ్ఛాయాం న లఙ్ఘయేత్
దణ్డప్రణామం కృత్వైకః త్రిః ప్రదక్షిణమాచరేత్"

ఇట నమస్కారమనగా జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి దాటిన నాల్గవస్థితియే యోగసమాధి నొందిన ముని మూడవస్థలను దాటిన స్థితియని భావించవచ్చు. "తురీయావస్థా నమస్కారః' అని శాస్త్రము.

శ్లో॥ హృద్దర్పణం మమ మృజన్తు తదా త్వదఙ్గ
ముద్యద్రవిద్యుతి భవేదిహ సానుబిమ్బమ్।
ఉత్తుఙ్గదైత్యసురమౌళిభిరుహ్యమానా
రుద్రప్రియే తవ పదాబ్జభవాః పరాగాః॥ 31

**పదవిభాగము:** హృద్దర్పణమ్, మమ, మృజన్తు, తదా, త్వదఙ్గమ్, ఉద్యద్రవిద్యుతి, భవేత్, ఇహ, సానుబిమ్బమ్, ఉత్తుఙ్గదైత్యసురమౌళిభిః, ఉహ్యమానాః, రుద్రప్రియే, తవ, పదాబ్జభవాః , పరాగాః

**ప్రతిపదార్థము :** రుద్రప్రియే=ఓ రుద్రాణి అయిన పార్వతీ!, తవ=నీయొక్క, ఉత్తుఙ్గ= ఉన్నతులైన, దైత్య=రాక్షసులు, సుర=దేవతల, మౌళిభిః=తలలచే, ఉహ్యమానాః =ధరించబడుచున్న, పద= పాదములను, అబ్జ=కమలమునందు, భవాః=పుట్టిన, పరాగాః =పుప్పొడి రేణువులు, మమ=నా యొక్క, హృత్=మనస్సను, దర్పణం=అద్దమును, మృజన్తు=పరిశుద్ధము చేయుగాక, తదా= అప్పుడు, ఉద్యత్=ఉదయించుచున్న, రవి=సూర్యునివంటి, ద్యుతి=కాంతిగల, త్వత్=నీయొక్క, అఙ్గమ్=శరీరము, సానుబిమ్బమ్=ప్రతిబింబము రూపమునొందినదై, ఇహ=ఇక్కడ అనగా నా మనస్సులో, భవేత్=ప్రతిబింబించును.

**భావము :** ఓ పార్వతీ! నీ అడుగులను తామరపువ్వులయందు పుట్టిన పుప్పొడి రేణువులు (అనగా పాదధూళి) గొప్పగొప్ప శక్తిగల దేవదానవుల శిరస్సులచే ధరింపబడుచున్నవి. ఆ రేణువులు నా మనస్సను అద్దమును పరిశుభ్రము చేయుగాక. (అద్దము మలినమైనపుడు వస్తువు దానియందు చక్కగా ప్రతిబింబించదు. అప్పుడు ఆ కాలుష్యమును పోగొట్టి ప్రకాశవంతముగా చేయుటకు విభూతి మొదలగు ధూళితో అద్దమును తుడుచుదురు. అప్పుడు అద్దము నిర్మలమై చక్కగా బింబమును గ్రహించును. ఇది లోకాచారము. ఆ విధముగా పరిశుద్ధమైనపుడు ఉదయించుచున్న సూర్యుని వంటి కాంతిగల నీ రూపము నిర్మలమైన నా మనస్సులో ప్రతిబింబించును.

**విశేషము :** హృదయమును అద్దముతో పోల్చినారు. ఇది చక్కగానున్నది. కామక్రోధాదులు అజ్ఞానము మలినమైన దుమ్మువలె హృదయమను అద్దమున చేరుటచే పరమాత్మ భావము చక్కగా నాటుకొనదు. పరమాత్మకళ ప్రతిఫలించదు. ఆ దోషములను నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, ముముక్షుత్వము, విరాగిత్వము, మహాత్ముల సేవ, సజ్జన సాంగత్యము, భక్తి మొదలగు లక్షణములచే తుడిచివేసిన హృదయము నిర్మలమై పరమాత్మ జ్ఞానము కలుగును. అమ్మవారి పాదధూళియే ఈ లక్షణములని భావించవచ్చును.

వా(గ్రూపమైన ఆత్మకళను నమస్కరించుచున్నామని భవభూతి మహాకవి చెప్పినాడు. "వన్దేమహి చ తాం వాచమమృతామాత్మనః కలామ్" ఏది నిత్యము? ఏది క్షణికము? అని తెలియుట నిత్యానిత్యవస్తు వివేకము. రెండవది ఈ లోకమున, స్వర్గమునందు గల భోగములపై కోరిక లేకుండుట, మోక్షము పొందవలెనను తపన. నాల్గవది వైరాగ్యము.

రూపకాలంకారము. మృజన్తు అనునది "మృజూష్ శుద్ధౌ" అను ధాతువునకు లోట్ ప్రథమ పురుష బహువచనము. మార్ష్టు, మృష్టాత్, మృష్టామ్, మార్జన్తు-మృజన్తు అని రూపములు. "మృజేర్వృద్ధిః" అని విధించబడిన వృద్ధి "కిజిత్యజాదౌవేష్యతే" అను వార్తికకారుని వచనముచే కిత్తు, జిత్తు గాని అయిన అజాదిప్రత్యయులు పరమగుటచే వికల్పముగావున ఇది వృద్ధి లేని రూపము ఉహ్యమానాః-'వహ ప్రాపణే' అను భ్వాదిగణధాతువునకు కర్మార్థమున 'భావకర్మణోః' అని తజ్‌ప్రత్యయము రాగా, సార్వధాతుకము గావున, 'సార్వధాతుకే యక్' అని యక్కురాగా కిత్తు గావున 'వచిస్వపియజాదీనాం కితి' అని సంప్రసారణము రాగా దానికంటె శానచ్‌ప్రత్యయముతో కూడిన రూపము. వహ ధాతువు యజాదులలోనిది.

'యజిర్వపిర్వహిశ్చైవ వసిర్వేఞ్వ్యేఞ్ ఇత్యపి
హ్వేఞ్వదీ శ్వయతిశ్చేతి యజాద్యాస్స్యురిమేనవ' అని తత్త్వబోధినిలో కారిక.

దేవతలను స్తోత్రంలో వర్ణించునపుడు పాదాది వర్ణన చేయవలెనను నియమమున్నను కవులు దానిని పాటించినట్లు కనపడదు. కుమారసంభవ, నైషధాలలో గూడ శిరస్సు నుండియే వర్ణనము. ఆ కావ్యములలో నాయికావర్ణనమని భావించినను, లలితాసహస్రములో శీర్షము నుండియే వర్ణనము గలదు. ఉమాసహస్రమున కావ్యకంఠగణపతిముని శిర ఆదిస్తుతి, పాదాదిస్తుతిని రెంటినీ గావించియున్నారు. శ్రీశంకరులు విష్ణుపాదాదికేశాన్తస్తుతి, శివునకు పాదాది, కేశాదిస్తుతులు వ్రాసిరి. కాన ఈ నియమము నియతము గాదు.

శ్లో॥ దద్యాస్సుఖాని మమ చక్రకలాన్తరస్థా
రక్తామ్బరాభరణమాల్యధరా జపాభా।
రుద్రాణి పాశసృణిచాపశరాగ్రహస్తా
కస్తూరికాతిలకినీ నవకుఙ్కుమాద్యా॥ 32

పదవిభాగము : దద్యాః, సుఖాని, మమ, చక్రకలాన్తరస్థా, రక్తామ్బరాభరణమాల్యధరా, జపాభా, రుద్రాణి, పాశసృణిచాపశరాగ్రహస్తా, కస్తూరికాతిలకినీ, నవకుఙ్కుమా, ఆద్యా.

ప్రతిపదార్థము : రుద్రాణి=ఓ పార్వతీ!, చక్ర=శ్రీ చక్రము నందలి, కలా=కళయొక్క, అన్తరస్థా=మధ్య భాగమున నున్నట్టి, రక్త=ఎఱ్ఱని, అమ్బర=వస్త్రములు, ఆభరణ=సొమ్ములు, మాల్య= పూలదండలను, ధరా=ధరించునట్టి, జపా=మందారపువుతో, ఆభా=సమానమైన, పాశ=త్రాడు, సృణి=అంకుశము, చాప=విల్లు, శర=అమ్ములను, అగ్రహస్తా=చేతిలో

ధరించినట్టి దానివి, కస్తూరికా=కస్తూరియను పరిమళద్రవ్యముచే, తిలకినీ=తిలకమును ధరించిన, నవ=క్రొత్తదైన, కుఙ్కుమ=కుంకుమము, ఆద్యా=మొదటగలది యనగా ముఖమునందు ధరించినది, ఆది యందున్నది ఆద్యము. ఆది యనగా మొదట శరీరము నందున్నది గావున ముఖము. ఆ ముఖమున కుంకుమను ధరించినదియని లేదా నవ=క్రొత్తదైన, కుఙ్కుమా=కుంకుమను ధరించి నది భక్తులు కుంకుమతో దేవిని పూజింతురు గాన కుంకుమతో కూడినదని, ఆద్యా=మొదటిది యనగా సృష్టి ప్రారంభముననున్నది. "ప్రకృతిస్త్వమాద్యా" అని ప్రయోగము. అట్టి నీవు, మమ=నాకు, సుఖాని=ఆనందములను, దద్యాః=ఇమ్ము అని ప్రార్థనలో విధిలిఙ్.

**భావము :** ఓ పార్వతీ! స్వయంవరకళాయంత్రమున కళ మధ్యభాగముననున్నట్టి దానివి, ఎఱ్ఱని పూలను, వస్త్రములను, సొమ్ములను ధరించిన దానివి, దాసానిపువ్వు లేదా మందార పువ్వులలో ఒకపువ్వువలె ఎఱ్ఱనికాంతులతో ప్రకాశించుచున్న దానివి, పాశము, అంకుశము, ధనుస్సు, బాణము లను నాల్గు చేతులతో ధరించిన దానివి, కస్తూరిచే తిలకమును ధరించిన దానివి, క్రొత్త కుంకుమచే ప్రకాశించుదానివి, మూలరూపిణివైన నీవు నాకు సుఖముల నొసంగుము. దేవి ఎఱ్ఱని వస్త్రములను ధరించునని కాళిదాసును శ్యామలాదండకమున "వికసితనవకింశుకాతామ్రదివ్యాంశుకచ్ఛన్న చారూరుశోభా..." అని వర్ణించినాడు. ఈ విషయమున "శ్రీమాతఙ్గీశ్వరీ మహావిద్య"లో-

శ్లో॥ రక్తామ్బరాం రక్తమాల్యాం రక్తాభరణభూషితాం
రక్తపద్మపదద్వన్ద్వాం శ్యామలామాశ్రయేఽనిశమ్॥ అని కలదు.
"సద్వీణాం శోణచేలాం" అని ధ్యానమునను గలదు.

**విశేషములు:** దద్యాః=దా ధాతువునకు విధిలిఙ్‌లో మధ్యమపురుషైకవచనము. దద్యాత్-దద్యాస్తామ్-దద్యాసుః. ప్రార్థనలో చాలా సందర్భములలో విధిలిఙ్ వాడుట కననగును. "దద్యాద్దయానుపవనో ద్రవిణామ్బుధారామ్" అని కనకధారాస్తుతిలో శంకరాచార్యులవారి ప్రయోగము.

**చక్రకళా :** చక్రమనగా శ్రీచక్రము లేదా స్వయంవరకలాదేవతకాక యన్త్రము గలదు. ఆ యన్త్రము యొక్క కళయందున్నదనియు చెప్పవచ్చును.

**శరాగ్రహస్తా :** అగ్రహస్తమనియు హస్తాగ్రమనియు రెండు ప్రయోగములు సాధువులని వామనుడు కావ్యాలంకారసూత్రమున తెలిపియున్నాడు. "హస్తాగ్రాగ్రహస్తాదయో గుణగుణినోర్భేదాభేదాత్"

**కస్తూరికా తిలకినీ :**కస్తూరియే తిలకముగా కలిగినదని యర్థము. కస్తూరికయా తిలకినీ. వైధర్మ్యము చేత గూడ రూపకనిర్వహణము జరుగవచ్చునని శ్రీమదప్పయ్యదీక్షితులు చిత్రమీమాంసలో తెలిపి వైధర్మ్యరూపకమునుదహరించియున్నారు.

"నద్యాశేఖరిణే దృశా తిలకినే నారాయణాయాస్త్రిణే
నాగైః కఙ్కణినే నగేన గృహిణే నాథాయ సేయం నతిః" చిత్ర. పేజి 67
"కస్తూరీతిలకాఞ్చితా" అని లలితాత్రిశతీనామము.

శ్లో॥ యత్పఙ్కజన్మనిలయం కరపద్మశుమ్భ
దమ్భోరుహం భువనమఙ్గలమాద్రియన్తే।
అమ్భోరుహాక్షసుకృతోత్కరపాకమేకం
సమ్భావయే హృది శివే తవ శక్తిభేదమ్॥ 33

**పదవిభాగము :** యత్, పఙ్కజన్మనిలయమ్. కరపద్మశుమ్భదమ్భోరుహమ్, భువనమఙ్గలమ్, ఆద్రియన్తే, అమ్భోరుహాక్షసుకృతోత్కరపాకమ్, ఏకమ్, సమ్భావయే, హృది, శివే, తవ, శక్తిభేదమ్.

**ప్రతిపదార్థము :** శివే=ఓ పార్వతీ! యత్=ఏ కారణము వలన, పఙ్కజన్మ=పద్మమే, నిలయమ్= స్థానముగా గలది, కర=చేయి అను, పద్మ=కమలమునందు, శుమ్భత్=ప్రకాశించుచున్న, అమ్భోరుహమ్=పద్మము గలది, భువన=లోకములయందు, మఙ్గలమ్=మఙ్గలదేవతగా ఖ్యాతి వహించినది, అమ్భోరుహ=పద్మములే, అక్ష=కన్నులుగా గల అనగా పుండరీకాక్షుడైన విష్ణువు యొక్క, సుకృత=పుణ్యము యొక్క, ఉత్కర=ఎక్కువదనము యొక్క, ఏక=ముఖ్యమైన, పాకమ్= పరిపాకమును అయిన, తవ=నీయొక్క, శక్తి=ఒకానొక సామర్థ్యము యొక్క, భేదమ్=విభాగమైన దానిని, ఆద్రియన్తే= ప్రజలు ఆదరించుచున్నారో, (ఆ కారణము వలన నేను గూడ) హృది=మనస్సు నందు, సమ్భావయే= ధ్యానించుచున్నాను.

**భావము :** ఓ పార్వతీ! పద్మము నందు నివసించునట్టిది, పద్మము వంటి చేతియందు ప్రకాశించుచున్న పద్మము గలది, లోకములకే మంగళకరమైనట్టిది, పద్మాక్షుడైన ఆ శ్రీమహావిష్ణువు చేసిన పుణ్యము యొక్క పరిపాకరూపమైనది అయిన లక్ష్మీ రూపమైన నీ శక్తి భేదమును ప్రజలందఱు ఏ కారణము చేత సేవించుచున్నారో ఆ నిమిత్తము చేతనే నేనును హృదయము నందు ధ్యానించుచున్నాను.

**విశేషము :** లక్ష్మీదేవి పద్మాలయ, పద్మహస్త, మఙ్గలదేవత కావున అదే భావమిట గలదు. 'పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయతాక్షి" అని లక్ష్మీస్తుతి. విష్ణువు చేసిన పుణ్యము ఫలమే లక్ష్మి. పురుషుడు కాక స్త్రీ చేసిన పుణ్యము వలననే తగిన భార్య లభించునందురు. కావుననే "యద్భర్తురేవ సుఖమిచ్ఛతి తత్కళత్రమ్", 'ఏతత్త్రయం జగతి పుణ్యకృతోలభన్తే" అని భర్తృహరి యనినాడు. ఏకశబ్దమునకు ముఖ్యమని యర్థము. "ఏకే ముఖ్యాన్యకేవలాః" అని కోశము.

శ్లో॥ మన్దారకున్దసుషమాకరపల్లవోద్య
త్పుణ్యాక్షదామవరపుస్తకపూర్ణకుమ్భా।

చన్ద్రార్ధచారుమకుటా నవపద్మసంస్థా
సన్దేదివీతు భవతీ హృది నస్త్రినేత్రా॥ 34

**పదవిభాగము :** మన్దారకున్దసుషమాకరపల్లవోద్యత్పుణ్యాక్షదామవరపుస్తకపూర్ణకుమ్భా, చన్ద్రార్ధచారుమకుటా, నవపద్మసంస్థా, సన్దేదివీతు, భవతీ, హృది, నః, త్రినేత్రా.

**ప్రతిపదార్థము :** మన్దార=మందారపువ్వు, కున్ద=మల్లెపూవులయొక్క, సుషమా=ఎక్కువ శోభచే ప్రకాశించుచున్న, కర=చేయి అను, పల్లవ=చిగురుటాకునందు, ఉద్యత్=ప్రకాశించుచున్న, పుణ్య= పవిత్రమైన, అక్షదామ=పూసలతో కూడిన జపమాల, వర=వరముద్ర, పుస్తక=గ్రంథము, పూర్ణ కుమ్భా=నిండుకడవలతో కూడిన దానివి. చన్ద్ర=జాబిల్లియొక్క, అర్ధ=సగపాలుచే అనగా అర్ధచంద్రునితో, చారు=అందమైన, మకుటా=కిరీటము గలదానివి. నవ= క్రొత్తదైన పద్మ=కమలము నందు (అనగా అప్పుడే వికసించిన) సంస్థా=ఉన్నట్టిదానివి, త్రినేత్రా= మూడు కన్నులు గలదానివి అయిన, భవతీ=నీవు, నః =మాయొక్క, హృది=హృదయమునందు, సన్దేదివీతు= ఎక్కువగా ప్రకాశించుదువు గాక యని ప్రార్థన.

**భావము :** మందారము, మల్లెపూవుల సొంపుతో ప్రకాశించుచున్న చిగురుటాకుల వంటి నాలుగు చేతులతో జపమాల, వరముద్ర, పుస్తకము, పూర్ణకుంభములను ధరించి, అర్ధచంద్రునితో ప్రకాశించు కిరీటము గలదానివి. అప్పుడే వికసించిన కమలమునందున్న దానివి, మూడు కన్నులు గలదానివి అయిన నీవు నా హృదయము నందు ఎక్కువగా ప్రకాశించుదువు గాక.

**విశేషములు:** మందారము, మల్లెల సొబగుతో చేతులొప్పారుననుచోట అన్యధర్మారోపములచే నిదర్శనాలంకారము. కరపల్లవ-రూపకము గలవు. నవయను పదమును వాడుటచే అప్పుడే విచ్చుకొన్న కమలము నందలి కాంతి వాడకుండుట. కోమలత్వము, నునుపుదనము, ఎఱుపు దనము వ్యక్తమగుచున్నవి. 'సం'యను ఉపసర్గమున ధ్యానము నందెల్లప్పుడు పద్మాసనగా ధ్యానింపవలయునని సూచితము. ఇది పార్వతీవర్ణనమని అర్ధచంద్ర, త్రిణేత్రపదములు వ్యక్తము చేయుచున్నవి. సన్దేదివీతు అనగా ఎక్కువగా ప్రకాశించుగాకయని. ఈ యఙ్లుగన్తక్రియ వ్యర్థముగా వాడబడినది కాదు. అమ్మవారు దేవి, దేవత. ఈ పదములు 'దివుక్రీడావిజిగీషామద స్వప్నకాన్తిగతిషు" అను ధాతువు నుండి ఏర్పడినవి. దీవ్యతీతి దేవః ప్రకాశించువాడు కావుననే దేవుడు, దేవత అయిరి. దేవియందట్టి ధర్మము సహజము. కావున ఆ సహజధర్మమే మఱింతగా నా హృదయమున ప్రకాశించవలయునని కోరుట యుక్తము. కావున ఇది సార్థక పదము.

సన్దేదివీతు : సమ్ పూర్వకమైన 'దివు క్రీడావిజిగీషావ్యవహారద్యుతిస్తుతి మోదమద స్వప్న కాన్తిగతిషు' అను ధాతువునకు ప్రకాశార్థమున భృశార్థము లేక పౌనఃపున్యార్థమున "ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్' అను సూత్రముచే యఙ్ రాగా 'సన్యఙోః

' అని ద్విత్వము, అభ్యాస కార్యముల పిదప "గుణోయజ్‌లుకః" అని గుణము. "యజ్‌ౘ చిచ" అని లుక్ రాగా పిమ్మట "యజోవా" అని ఈడాగమము వచ్చి సందేదివీతి కాగా "ఏరుః" అని లోట్‌లో ప్రవర్తించి సన్దేదివీతు అని రూపము.

త్రినేత్రా : బహుబ్రీహిలో 'సంజ్ఞావాచకము' కానందున 'పూర్వపదాత్సంజ్ఞాయామగః' అను ణత్వము రాదు. ణత్వము చేసిన సంజ్ఞావాచకము కావలసివచ్చును. కావుననే రఘునాథ పదమున సంజ్ఞాభంగము కారాదు కావున ణత్వము రాదని. కావుననే "ప్రత్యయాన్తేన చేత్సంజ్ఞా గమ్యతే" అని భాష్యపంక్తిని బాలమనోరమాకారుడుట్టంకించెను. శూలినీ దుర్గాస్తుతిలో "చన్ద్రోత్తంసాం త్రిణేత్రాం" అని యున్నది గావున అట శూలినికి సంజ్ఞావాచకమని భావింపవలయును. ఇట తాత్కాలికముగా జ్ఞానదృష్టిని గ్రహించి శంకరుని యిల్లాలైన శాంకరిగావున త్రినేత్రిగా వర్ణించినాడే గాని పార్వతికి నిత్యముగాదని భావింపవలెను. పార్వతీ నామముల రూఢ్యర్థమున ఈ పదము కానరాదు. కావున యోగార్థమున నిట ప్రయోగము.

శక్తి స్వరూపిణి గావున ఈమెయే లక్ష్మియు, పార్వతియునగును. భారతి గూడ కావచ్చును. అందుకే మహాకవి కాళిదాసు, ఒకేశక్తి ముగురమ్మలుగా మారినదని, "ఏకైవ శక్తిః బిభిదే త్రిధా సా" అనినాడు. అంతేగాక శ్రీ శంకరభగవత్పాదుల వారును కనకధారాస్తుతి లో ఒకేశక్తియే వాణీలక్ష్మీగిరిజలుగా మారినదని వర్ణించిరి. చూడుడు-

**గీర్దేవతేతి గరుడధ్వజసున్దరీతి-శాకమ్భరీతి శశిశేఖరవల్లభేతి।**
**సృష్టిస్థితిప్రలయకేలిషు సంస్థితాయై-తస్యై నమస్త్రిభువనైకగురోస్తరుణ్యై॥**

ధ్యానశ్లోకములయందునిట్లే గలదు. చూడుడు-

**విద్యాప్రదానసమయే శరదిన్దుశుభ్రాం-లక్ష్మీప్రదానసమయే నవవిద్రుమాభామ్।**
**విద్వేషివర్గవిజయే చ తమాలనీలామ్-బాలామనన్యశరణశ్శరణం ప్రపద్యే॥**

మహాదుర్గా, మహాలక్ష్మీ, మహాసరస్వతి ధ్యానభేదముచే ముగ్గురుగాని వస్తుతః ఒకటి యనియే దుర్గాసప్తశతి భావము. ఇక ప్రస్తుతముననుసరించుట మంచిది. ఈమె శ్యామలా రూపిణియే. బాలచంద్రుని ధరించునని "వపుశ్శ్యామలం కోమలం చన్ద్రచూడాన్వితం" అని కాళిదాసుని వర్ణనము శ్యామలాదండకమున గలదు.

**శ్లో॥ మధ్యే కదమ్బవనమాస్థితరత్నడోలా-**
**ముద్యన్నఖాగ్రముఖరీకృతరత్నవీణామ్।**
**అత్యన్తనీలకమనీయకళేబరాం త్వా**
**ముత్సఙ్గలాలితమనోజ్ఞశుకీముపాసే ॥ 35**

**పదవిభాగము :** మధ్యే కదమ్బవనమ్, ఆస్థితరత్నడోలామ్, ఉద్యన్నఖాగ్రముఖరీకృత రత్నవీణామ్, అత్యన్తనీలకమనీయకళేబరామ్, త్వామ్, ఉత్సఙ్గలాలితమనోజ్ఞశుకీమ్, ఉపాసే.

**ప్రతిపదార్థము :** మధ్యే కదమ్బవనమ్=కడిమిచెట్లతోటనడుమ, ఆస్థిత=ఆశ్రయించబడిన, రత్న= మణులతో కూర్చబడిన, డోలామ్=ఊయెలగల, ఉద్యత్=ప్రకాశించుచున్న, నఖ=గోళ్ల, అగ్ర= ముందుభాగములచే అనగా గోటి కొనలచే, ముఖరీకృత=ధ్వనిచేయబడుచున్న, రత్న=మణుల, వీణామ్=వీణియగలట్టి, అత్యన్త=మిక్కిలి, నీల=నల్లని, కమనీయ=చక్కని, కళేబరామ్=శరీరము గల, ఉత్సఙ్గ=ఒడి యందు, లాలిత=బుజ్జగింపబడిన, మనోజ్ఞ= మనసునకానందమును గూర్చు, శుకీమ్=ఆడుచిలుక గల, త్వామ్=నిన్ను, ఉపాసే=ఉపాసన చేయుచున్నాను.

**భావము :** కడిమి చెట్ల తోటలో, నడిమి భాగమున మణులచే చేయబడిన ఉయాల నధిరోహించి యూగుచున్నట్టి, కాంతివంతములైన గోటికొనలతో రత్నాల వీణను మ్రోయించుచున్నట్టి, మిక్కిలి నల్లని శరీరము గలట్టి, ఒడిలో అందమైన చిలుకను లాలించుచున్నట్టి నిన్ను నేను ఉపాసించు చున్నాను.

**విశేషములు :** మధ్యే కదమ్బవనమన్నచోట కదమ్బవనస్య మధ్యే అను విగ్రహమున "పారే మధ్యే షష్ఠ్యా వా" అని అవ్యయీభావసమాసము. "నావ్యయీభావాదతోఽ మ్త్వపఞ్చమ్యాః" అని అమ్భావము. 'ఆసఉపవేశనే' అను అదాదిధాతువునకు ఉపాసే అని ఆత్మనేపది లట్ ఉత్తమైకవచనము కళేబర శబ్దమును శరీరపర్యాయముగా వాడుట గలదు. ఇది జంతుశరీరములకే వాడవలయునని లేదు. జయదేవుడు గీతగోవిందమున 'నీలకళేబరపీతవసనవనమాలీ' అని వాడియున్నాడు. ఇది శ్యామలాంబారూపము. శ్యామలాంబాదేవి నీలశరీరము కలది. వీణ మ్రోయించుచుండు ననుటకు శ్రీ శంకరాచార్యులవారి శ్యామలానవరత్నమాలికను చూడుడు.

"కున్దముకులాగ్రదన్తాం కుఙ్కుమపఙ్కేనలిప్తకుచభారామ్
ఆనీలనీలదేహాం అమ్బామఖిలాణ్డనాయికాం వన్దే।
సరిగమపదనిరతాం తాం వీణాసఙ్క్రాన్తకాన్తహస్తాం తామ్
శాన్తాం మృదులస్వాన్తాం కుచభరతాన్తాం నమామి శివకాన్తామ్॥"

శ్యామలాంబ శుకమును లాలించును. కాళిదాసు శ్యామలాదండకమున నిట్లే వర్ణించినాడు. చూడుడు- "కోమలశ్యామలోదారపక్షద్వయం తుణ్డశోభాతిదూరీభవత్కిం శుకం తం శుకం లాలయన్తీ పరిక్రీడసే" కడిమి చెట్లతోటలో విహరించుటను కాళిదాసిట్లు వర్ణించెను. -"కాదమ్బకాన్తారవాసప్రియే" ఈ లక్షణములీ కాళిదాసుని ప్రార్థనాశ్లోకమున గలవు.

"కటాక్షయతు కల్యాణీ కదమ్బవనవాసినీ
జయ మాతఙ్గతనయే జయ నీలోత్పలద్యుతే
జయ సఙ్గీతరసికే జయ లీలాశుకప్రియే"

శ్యామలాంబానామములలో గూడ ఈ శ్లోకమున వర్ణింపబడిన లక్షణములు

గోచరించు చున్నవి. చూడుడు- 'సఙ్గీతయోగినీ శ్యామా-శుకప్రియా-వీణావతీ-నీపప్రియా, కదమ్బ వనవాసినీ।"- లలితాసహస్రములో "కదమ్బవనవాసినీ" అని గలదు. ఈమె కోదండము పేరు చిత్రజీవము. యన్త్రిణీ, తన్త్రిణీ పరిచారికలు. ఈ మాతఙ్గీ దేవత మాతఙ్గమహాముని కుమార్తె. మాతఙ్గముని తపస్సుకు మెచ్చి మన్త్రిణీదేవి ప్రత్యక్షము కాగా ఆమెను తనకుమార్తెగా జన్మింపుమని కోరినాడు. హిమవంతునివలె తాను దేవికి తండ్రి కావలయునని కోరినాడు. దేవియందుకు అంగీకరించినది. ఒకనాటి స్వప్నములో మాతఙ్గముని పత్నికి చీకటిమ్రానుయొక్క పూలగుత్తి నొసంగినది తరువాత ఆమె గర్భమున శ్యామలాదేవి జన్మించినది. ఈమెయే మాతఙ్గీ దేవత. బ్రహ్మాండపురాణమున లలితోపాఖ్యానమున 36వ అధ్యాయములో ఈ యుత్పత్తి గాథ వర్ణితము. ఈమె నారాధించు పద్ధతిలో స్తోత్రము ముఖ్య సాధనము. ఉమాసహస్రమున శ్రీ కావ్యకణ్ఠముని 'మాతఙ్గీం తాం గుణగానేన' అన్నారు. "వైఖర్యా మాతఙ్గీ ప్రసన్నాభవతి' అని చక్కని యుచ్చారణ, వ్యాకరణసమ్మతపదములచే స్తుతించుటవలన ప్రసన్నురాలగునని వ్యాఖ్య- మాతఙ్గీ శక్తిని గూర్చి "రసనిధిమాప్తా జిహ్వారఙ్గం మాతఙ్గీతిప్రథితా ......" యని కావ్యకణ్ఠులవారు, 'వైఖరీ మాతఙ్గీ' యని వ్యాఖ్యాతలు చెప్పిరి.

శ్లో॥ వర్తామహే మనసి సన్దధతీం నితాన్త-
రక్తామ్బరామయవిరాజికరారవిన్దామ్।
ఉద్వేలమధ్యవసతిం మధురాఙ్గి మాయాం
తత్త్వాత్మికాం భగవతీం భవతీం భజన్తః॥ **36**

**పదవిభాగము :** వర్తామహే, మనసి, సన్దధతీమ్, నితాన్తరక్తామ్బరామయ విరాజికరారవిన్దామ్, ఉద్వేలమధ్యవసితిమ్, మధురాఙ్గి, మాయామ్, తత్త్వాత్మికామ్, భగవతీమ్, భవతీమ్ భజన్తః.

**ప్రతిపదార్థము :** మధురాఙ్గి=ఓ మనోజ్ఞములైన యవయవములు గల పార్వతీ!, నితాన్త=ఎక్కువగా, రక్త=ఎఱ్ఱనైన, అమ్బర=వస్త్రములను, ఆమయ=చేతివ్రేళ్లవఱకు గల తొడుగులచే, విరాజి= ప్రకాశించుచున్న, కర=చేయి అనెడి, అరవిన్దామ్=పద్మములను కలిగిన, ఉద్వేలమ్=ఎక్కువగా, అధ్యవసితిమ్=అధ్యవసాయాత్మకమైన, మాయాం= మాయాశక్తిని, సన్దధతీమ్=ధరించుచున్నట్టి, తత్త్వాత్మికామ్=ఇరువదియైదు తత్త్వములు స్వరూపముగా గల, భగవతీమ్=దేవియైన, భవతీమ్=నిన్ను, మనసి=మనస్సులో, భజన్తః =సేవించుచున్నవారమై, వర్తామహే=నివసించు చున్నాము, జీవనము గడుపుచున్నాము.

**భావము :** ఓ అందమైన అవయవములు గలదానా! మిక్కిలిగా నెఱ్ఱనైన వస్త్రములను, చేతివ్రేళ్ల వరకు అందమైన తొడుగులుగా గల పట్టు మొ॥ వస్త్రములను ధరించుటచే ప్రకాశించుచున్న కమలముల వంటి చేతులు గల, ఇంకను అధికముగా ఒకదానియందు మతియొకటిగా భావన చేయించు మాయాశక్తిని ధరించుచున్నట్టి, తత్త్వమయమైన దానివి, దేవతవు అయిన నిన్ను మనస్సుతో ధ్యానము చేయుచూ ఉందుము.

**విశేషములు :** ఇట కవి మధురాఙ్గీయని ప్రయోగించినారు. ఇది అత్యన్తతిరస్కృతార్థమై సొగసును వ్యంజింపజేయుచున్నది. మధురశబ్దము వ్యంగ్యార్థమునకనుకూలమని ధ్వనికారుడు వివరించియున్నాడు. కాళిదాస మహాకవి "మధురమాసాం దర్శనమ్" "కిమివ హి మధురాణాం మణ్డనం నాకృతీనామ్" అని అభిజ్ఞానశాకున్తలమున పలుతావుల ప్రయోగించియున్నాడు. అధ్యవసితి అనగా అధ్యవసాయము. ఈ రెండు పదములకు ఒక వస్తువునందలి ధర్మమును కప్పివేసి ఇంకొక ధర్మమును నిశ్చయించి వ్యవహరించుట యని అర్థము. ఆలంకారిక దృష్టితో చూచినపుడు అతిశయోక్త్యలంకారము.

"పశ్య నీలోత్పలద్వన్ద్వాన్నిస్సరన్తి సితాశ్శరాః" నల్లకలువలజంట నుండి బాణములు వెలువడుచున్నవన్నపుడు అధ్యవసాయము ఇది రూపకమిశ్రితము. కన్నుల యందు కలువల స్వభావము, చూపులయందు బాణముల స్వభావము కలదు. కన్నులు, అమ్ములయం దాయా స్వభావములు కప్పివేయబడి, ఇతరధర్మములతో వ్యవహారము. ఇట్లే, **"అనాకాశే కోఽయం గలితహరిణశ్శీతకిరణః"** అన్నపుడును మోమును చూచి చంద్రుడని వ్యవహరించుట. **"వాపీకాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపద్యా"** మొ॥ స్థలములయందును గలదు. అది యట్లుండ, శాస్త్రములయందును అధ్యవసాయము నిరూపింపబడినది. ఇదియే సుమారుగా అధ్యాసయందురు. **"అధ్యాసో హి నామ అతస్మింస్తద్బుద్ధిరిత్యవోచామ"** అని శ్రీశంకరాచార్యుల వారు తమభాష్యమున తెలిపిరి. శుక్తియందు (ముత్యపుచిప్ప) శుక్తిధర్మము కప్పివేయబడగా అది రజతత్వప్రకారముగా జ్ఞానము కలుగుట. ఇట్లే త్రాటియందు పాము భ్రాంతి. ఇట్టి అధ్యవసాయము వలన (అధ్యాస) బ్రహ్మము ప్రపంచముగా గోచరించి భయమును కలిగించును. అధ్యవసాయమున అనందము కొరకు తెలిసి వ్యవహరించుట యుండును. అధ్యాస అజ్ఞానము వలన జీవునకు కలుగును. ఇట్టి అజ్ఞానము సంసారమునకు మూలము. ఇది సోఽహం భావన వలన, సాధన, పురాకృత సుకృతము, గురుని యనుగ్రహము వలన తొలగి జ్ఞానోదయముకలుగ ముక్తి కలుగును. ఈ జ్ఞానమునే "సర్వం ఖల్విదం బ్రహ్మ" "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" యను వేదాన్త వాక్యములు బోధించుచున్నవి. తాను జీవుడను, శరీరము, ఇంద్రియములు మొదలైనవి కానని శివస్వరూపుడను జ్ఞానము కోట్ల జన్మలకు కలుగును. కావుననే శ్రీ శంకరులు, తమ వివేక చూడామణిలో

**"ఆత్మానాత్మవివేచనం త్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః**
**ముక్తిర్నో శతకోటిజన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే"** అనినారు. కావున శరీరము, ఇంద్రియముల కంటె భిన్నుడగుటయే ముక్తి- కావున శ్రీ శంకరులు,

**"నాహం దేహో నేన్ద్రియాణ్యన్తరఙ్గం-నాహఙ్కారః ప్రాణవర్గో న బుద్ధిః**
**దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః-సాక్షీ నిత్యస్సచ్చిదాత్మా శివోఽహమ్"** అని యథార్థమును ప్రతిపాదించిరి. దేవి సంసారమునకు మూలమైన అధ్యాసరూపమైన అవిద్యాత్మిక అయిన మాయను ధరించియున్నది. బ్రహ్మమునకు "పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే" అని అనేక శక్తులున్నవని వేదములు తెలిపినవి. **"మామేవ యే ప్రపద్యన్తేమాయా**

మేతాం తరన్తి తే" అని గీతాచార్యుడు చెప్పినట్లు దేవిని శరణు వేడిన వారికి మాయ తొలగును. ఇక ప్రస్తుత విషయము ననుసరించెదము. తత్త్వాత్మికయని దేవికి విశేషణము. శాస్త్రముల యందు ఇరువదియైదు తత్త్వములు చెప్పబడియున్నవి. ఈశకృష్ణుని సాంఖ్యకారికలయందిట్లున్నది-

"మూలప్రకృతిరవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త
షోడశకస్తు వికారో న ప్రకృతిర్నవికృతిః పురుషః"

– సాంఖ్యరమణీయయను వ్యాఖ్యానమున వీటి వివరములు చెప్పబడినవి. సాంఖ్య శాస్త్రమున తత్త్వములు ఇరువది నాలుగు. మూలప్రకృతి- మహత్తత్త్వము, అహంకారతత్త్వము, సాత్త్వికాహంకారము నుండి ఏకాదశ ఇంద్రియములు (చర్మము-కన్ను- నాలుక, నాసిక, చెవి, వాక్కు, చేతులు, పాదములు, పాయువు, ఉపస్థ+మనస్సు) తామసాహంకారము నుండి ఐదు తన్మాత్రలు. తన్మాత్రల నుండి పంచభూతములు. ఇవి తత్త్వములు అన్నియు ఈ దేవియే కావున తత్త్వాత్మికమైనది. మూలప్రకృతియే వీటికి మూలము. అదియే ప్రధానము. దేవి ప్రకృతియే అనుటకు దేవ్యథర్వశీర్షోపనిషత్తున దేవీవాక్యమే ప్రమాణము. "అహం ప్రకృతిస్వరూపిణీ మత్తః సర్వం ప్రకృతిపురుషాత్మకం జగత్". కావుననే గాయత్రీమాతయు "తత్త్వార్థవర్ణాత్మికామ్" అని వర్ణింపబడినది. కావున దేవి తత్త్వాత్మిక లేదా తత్త్వములనగా 36 తత్త్వములు. శ్రీవిద్యాపంచాంగము ప్రకారము 36 తత్త్వములుండును. అట్టి తత్త్వాత్మిక యీ దేవతయని భావము.

**ఉద్వేలము-పదసార్థకత :** ఈ భ్రాంతి లోకమందలి భ్రాంతుల వలె సామాన్యమైనది గాదు. ఈ భ్రాంతి సంసారమను నరకమున కొన్ని జన్మముల పాటు పడవేయును గావున ఉద్వేలమను పదమును కవివాడుట సార్థకము. ఉద్వేలమనగా హద్దును దాటినదని యర్థము. దేవికి సమగ్రమైన యైశ్వర్యము, పరాక్రమము, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యములుండుటచే భగవతియని నిర్దేశించినారు. భగః అస్యా అస్తీతి భగవతీ అని వ్యుత్పత్తి-భగశబ్దమునకు గలయర్థములివి-

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః-జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా"

ఆమయమనగా చేతివ్రేళ్ల వఱకు తొడుగురూపమున గల వస్త్ర విశేషము. ఆరాణి విన్దతీతి అరవిన్దమ్. దళములను పొందునది గావున అరవిందము పద్మము.

**అరవిన్దమ్-"అరాణి విన్దతీతి"** అరవిన్దమ్ అనియగును. అరములనగా చక్రమునాభి నుండి అంచువఱకు గల కఱ్ఱలు. అట్టివే రేకులు గావున వానిని పొందుటచే నరవిన్దము. "విద లాభే" యను ధాతువునకు "గవాదిషు విన్దేస్సఞ్జా యాం" అను వార్తికముచే శప్రత్యయము వచ్చి రూపమేర్పడును. మధురాజ్ఞీ. మధురాజ్ఞ శబ్దము సంయోగోపధము కావున "స్వాఙ్గాచ్చోప సర్జనాదసంయోగాపధాత్" అను సూత్రముచే "అఙ్గగాత్రకణ్ఠేభ్యోవక్తవ్యమ్"

అను వృత్తికారుని వచనము వలన జీష్ వచ్చి మధురాఙ్గీ యను రూపమేర్పడును. "నాసికోదర-" అను సూత్రమందలి చకారము వలన ఈ రూపములేర్పడునని కొందఱు. భాష్యమున లేకుండుటచే అప్రామాణికమని మఱికొందఱనుచున్నారు. కాని ప్రయోగములు కావ్యములయందేనకములు. **"అనయోరనవద్యాఙ్గీ"** కాళిదాసు. **"ఉపనిషదుద్యానకేలి కలకణ్ఠీమ్"** ఇట్లే తన్వఙ్గీ, శుభాఙ్గీ సుగాత్రీరూపములు. వృత్తిననుసరించుట లేదా సూత్రకారుని మతమున చకారముచే సాధించుట యుక్తమని తోచెడిని.

**మాయామ్ :** మాయ యనగా లేనిది యున్నట్లు కనుపింపజేసి అజ్ఞానముచే జీవుని బంధించును. ముత్యపుచిప్పయందు వెండియను భ్రాంతి కలిగినపుడు అది ఉన్నదా? లేనిదా? యన్నప్పుడు అది అనిర్వచనీయమని వేదాంతులందురు. దాని మూలకారణమైన యుపాదానమును మాయయే. కావుననే ఈ విషయమును **"తదభావస్థలే తదభావస్యానిర్వచనీయత్వం తథాపి తదుపాదానం మాయైవ"** అని అద్వైతవేదాన్తపరిభాషలో (పి.170) ప్రతిపాదింపబడినది. దేవియూ మాయ. ప్రకృతి స్వరూపిణి. మాయయే ప్రకృతి. కావుననే **"మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్"** అని గీత. మాయ, నిత్యము, నిరుపమము. జ్ఞానస్వరూపమైన బ్రహ్మము నందు గూడ ప్రపంచము, ఈశ్వరుడు, జీవుడు అను భేదములను సృష్టించి జీవత్వమును కల్పించి సంసార సాగరమున బంధించును. మాయ చేయలేనిది ఏమియును లేదు. ఇందులకు మాయాపఞ్చకమును చూడుడు-

**"నిరుపమ నిత్యనిరంశకేఽ ప్యఖణ్డే-మయి చితి సర్వవికల్పనాదిశూన్యే**
**ఘటయతి జగదీశ జీవభేదం-త్వఘటితఘటనాపటీయసీ మాయా"**

ఈ మాయను దాటి ముక్తిని పొందవలెనన్న భగవంతునే ఆశ్రయించవలయును. **"మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే"** అని, నన్నెవరు సేవింతురో వారే మాయనతిక్రమింప గలరని శ్రీకృష్ణభగవానుడు తెలిపినాడు. మన మిట్టి ప్రకృతి, మాయయగు దేవినే శరణు వేడుచున్నాము. మాయాశబ్దముచే హ్రీంకారము సూచితమగును. కావుననే, శ్రీశంకరాచార్యుల వారు త్రిశతీవ్యాఖ్యానమున **"జ్ఞాపకం దేవతానాం యద్బీజమక్షరముచ్యతే"** అనియు, **"హ్రీంకారస్య మాయాప్రకాశకత్వేన"** అని 'హ్రీంపదప్రియా' నామవ్యాఖ్యలోను తెలిపినారు.

**శ్లో॥ శమ్భుప్రియాం శశికలాకలితావతంసాం**
**సమ్భావితాభయవరాఙ్కుశపాశపాణిమ్।**
**సమ్పత్ప్రదాననిరతాం భువనేశ్వరీం త్వాం**
**శుమ్భజ్జపారుచామపారకృపాముపాసే॥ 37**

**పదవిభాగము :** శమ్భుప్రియామ్, శశికలాకలితావతంసామ్, సమ్భావితాభయవరాఙ్కుశపాశ పాణిమ్, సమ్పత్ప్రదాననిరతామ్, భువనేశ్వరీమ్ త్వామ్, శుమ్భజ్జపారుమ్అపారకృపామ్, ఉపాసే.

ప్రతిపదార్థము : శమ్భుప్రియామ్=శంకరునకు నిష్టమైనట్టి, శశికలా=చంద్రకళ చేత, కలిత= ఒప్పారుచున్న, అవతంసామ్=తలపై ధరించుసొమ్ము గలది, సమ్భావిత=బాగుగా భావింపబడిన, అభయ=అభయముద్ర, వర=వరదానముద్ర, అఙ్కుశ=ఒకానొక యాయుధము, పాశ=త్రాడు వీటితోకూడిన, పాణిమ్=చేయి కలిగినట్టిది, సమ్పత్= సంపదలను, ప్రదాన=ఇచ్చుటయందు, నిరతామ్=లగ్నమైనట్టిది, శుమ్భత్=వ్యాపించుచున్న, జపా=దాసానిపువ్వువంటి, రుచమ్=కాంతి గలిగినట్టి, అపార=అంతులేని, కృపా=దయ గలిగినట్టి, భువనేశ్వరీమ్=లోకములకు ప్రభ్వివైన లేదా భువనేశ్వరీరూపముననున్న, త్వామ్=నిన్ను, ఉపాసే=ఉపాసించుచున్నాను.

**భావము :** నీవు శివుని యర్ధాంగివి. చంద్రరేఖ నీ శిరస్సున ప్రకాశించుచుండును. నీవు నాల్గు చేతులతో అభయముద్ర, వరముద్ర, అంకుశము, పాశములను నాయుధములను ధరించి యుంటివి. భక్తులకు సంపదల నొసంగుటలో నిమగ్నమై యుంటివి. ఎఱ్ఱని మందారపువ్వు వంటి కాంతితో నీవు వెలుగొందుచుంటివి. అంతులేని దయగలదానవు. ఇట్టి భువనేశ్వరీదేవతవైన నిన్ను ధ్యానము చేయుచున్నాను. శుమ్భత్ అను విశేషణము వలన దాసానిపూవు క్షణక్షణమునకు ప్రకాశించదు. కాని అమ్మవారు క్షణక్షణమునకు ఎక్కువగా ప్రకాశించుచుండునని సూచితము.

**శ్లో॥ ఆరూఢతుఙ్గతురగాం మృదుబాహువల్లీం
ఆరూఢపాశసృణివేత్రలతాం త్రినేత్రామ్।
ఆరోపితామఖిలసంవననే ప్రగల్భాం
ఆరాధయామి భవతీం మనసా మనోజ్ఞామ్॥ 38**

**పదవిభాగము :** ఆరూఢతుఙ్గతురగామ్, మృదుబాహువల్లీమ్, ఆరూఢపాశసృణివేత్రలతామ్, త్రినేత్రామ్, ఆరోపితామ్, అఖిలసంవననే, ప్రగల్భామ్, ఆరాధయామి, భవతీమ్, మనసా, మనోజ్ఞామ్.

**ప్రతిపదార్థము :** ఆరూఢ=ఎక్కబడిన, తుఙ్గ=ఎత్తైన, తురగామ్=గుఱ్ఱముగలదానవు, మృదు= సుకుమారమైన, బాహు=చేతులను, వల్లీమ్=పూలతీగలు గలదానవు, ఆరూఢ=ధరించబడిన, పాశ=త్రాడు అను నాయుధము, సృణి=అంకుశము, వేత్రలతామ్=తీగవంటి బెత్తముగలదానవు, త్రినేత్రామ్=మూడు కన్నులు గలదానవు, అఖిల=అందఱిని, సంవననే=వశీకరణము చేసికొనుటలో, ప్రగల్భామ్=చాఱవగలదానివి, మనోజ్ఞామ్= మనమునకానందము నిచ్చుదానివి అయిన, భవతీం=నిన్ను, మనసా=నానిండు మనంబుతో, ఆరాధయామి=పూజించుచున్నాను.

**భావము :** ఎత్తైన గుఱ్ఱమును వాహనముగా చేసికొని అధిరోహించినట్టి, పూలతీవియల వోలె కోమలమైన చేతులు గలిగినట్టి, పాశము, అంకుశము, వెదురుబెత్తమును ధరించిన దానివి, మూడు కన్నులు గలిగినట్టి, అందరిని వశము చేసికొనుటలో చాఱవగలది,

అఖిలాండేశ్వరి అయిన ఆ పరాశక్తిచే నియమింపబడినట్టి, భక్తులను రక్షించుటలో దుర్జనులను నిగ్రహించుటలోను చొఱవ గలిగినట్టి మనస్సున కాహ్లాదమును కూర్చునట్టి నిన్ను సంపూర్ణమైన మనస్సుతో ఆరాధించుచున్నాను.

**విశేషము :** సంవననమ్ అనగా వశము చేసికొనుట. "వశక్రియా సంవననమ్" అని సంకీర్ణవర్గలో అమరము. వనుధాతువునకు భావార్థమున ల్యుట్ప్రత్యయము. వనుధాతువునకు వ్యాపార మాత్రమర్థమని ధాతుప్రక్రియ (పేజి 1093). సిద్ధాన్తకౌముదిలో "వను చనోచ్యతే, వను ఇత్యపూర్వ ఏవాయం ధాతుః తేన క్రియాసామాన్యే వనతీత్యాది" అని గలదు. సముపసర్గతో కూడి వశీకరణమున ప్రయోగము. సామాన్యార్థముతో కూడుటచే విశేషార్థమున ప్రయోగింప బడినదని తెలియవలయును.

శ్లో॥ కర్మాత్మికే జయ జయాఖిలధర్మమూర్తే
చిన్మాత్రికే జయ జయ త్రిగుణస్వరూపే।
కల్మాషధారిపిశునాన్ కరుణామృతార్ద్రైః
సమ్మార్జ్య సమ్యగభిషిఞ్చ దృగఞ్చలైర్నః॥ 39

**పదవిభాగము :** కర్మాత్మికే, జయ, జయ, అఖిలధర్మమూర్తే, చిన్మాత్రికే, జయ, జయ, త్రిగుణస్వరూపే, కల్మాషధారిపిశునాన్, కరుణామృతార్ద్రైః సమ్మార్జ్య, సమ్యక్, అభిషిఞ్చ, దృగఞ్చలైః నః.

**ప్రతిపదార్థము :** కర్మాత్మికే=శ్రుతి, స్మృతులయందు చెప్పబడిన అన్ని కర్మల రూపములోనున్నట్టి తల్లీ, జయ, జయ=వర్ధిల్లుము వర్ధిల్లుము, అఖిల=సమస్తమైన, ధర్మ=ధర్మ స్వరూపమే, మూర్తే= శరీరముగా గలదానా! చిన్మాత్రికే=జ్ఞానస్వరూపిణివైనదానా! త్రిగుణ=సత్త్వ, రజస్తమస్సులను మూడు గుణములే, స్వరూపే=స్వరూపముగా గలదానా! జయ జయ=బాగుగా వర్ధిల్లుము, కల్మాష= నలుపుదనము అనగా పాపమును, ధారి=ధరించునట్టి, పిశునాన్=సంకుచిత జ్ఞానముగల, నః=మమ్ము, కరుణా=దయయను, అమృత=సుధచే, ఆర్ద్రైః=తడిసినట్టి, దృక్=చూపుల, అఞ్చలైః=చివటి భాగములతో, సమ్మార్జ్య=పరిశుద్ధము చేసి, సమ్యక్=బాగుగా, అభిషిఞ్చ=స్నానము చేయించుము.

**భావము :** అన్ని కర్మల స్వరూపమైనట్టి తల్లీ, నీవు దేవతలు, మానవులు, రాక్షసులందరిలోను మహిమాతిశయముచే ఎక్కువగా ప్రకాశించుచు, విజయమును సాధింపుము. సర్వధర్మ స్వరూపిణివి, కేవలము జ్ఞానస్వరూపిణివి. ప్రాణులలో సత్త్వ-రజస్తమోగుణరూపమున నున్నట్టి దానివి అయిన నీవు సర్వోత్కర్షచే ప్రకాశించుము. పాపముచే సంకుచితాత్మ భావము గల మమ్ము దయాదృష్టులచే శుద్ధులను చేసి జ్ఞానామృతముచే స్నానము చేయించుము.

**విశేషములు :** కుటిలత్వం కలిగిన ఖలులమైన మమ్ము దయాదృష్టులతో తుడిచివేయుము. అనగా ఖలత్వము పోవునట్లు చేయుటయే గాక మాయందవిరతముగా అభిషేకమువలె ప్రసరింపజేసి యుద్ధరింపుమని కవి కాంక్ష. స్నానం చేస్తే ఏ విధంగా మాలిన్యం

కడిగివేయబడి పరిశుద్ధత కలుగుతుందో, ఆ విధంగా నీ దయావీక్షణాలు ఎడతెఱపి లేకుండా పడడం వలన మా మనస్సులలో గల రాగద్వేషాలు, అజ్ఞానము పోయి పరిశుద్ధులమవుతామని ఆచార్యుల యాకాంక్ష లెస్సగ నున్నది. ఇందువలన జననమరణాలు గూడ పోతాయని 'అమృత'శబ్దం సూచిస్తుంది. కల్మషములను పోగొట్టును గావుననే "కల్మషఘ్నీ" అని లలితాత్రిశతీనామము. పాపమనునర్థమున '**అంహోదురితకల్మషమ్**' అని కల్మషపదము. కల్మాషమనినను పాపమే. నలుపు అనగా పాపము. కల్మషమనగా అన్ని రంగుల కలయిక. "**చిత్రం కిర్మీర కల్మాషశబలైతాశ్చ కర్బురే**" అని కోశము. ఇచట రంగుల కలయికయనగా మనసులో రాగద్వేషాదుల కలయిక. దానిని ధరించుటచే పిశునత్వము అజ్ఞానమూలమైన సంకుచితత్వమని భావము.

**శ్లో॥ షణ్ణామపి త్వమధిదైవతమక్షరాణాం**
**వర్ణత్రయోదితమనుప్రకృతిస్త్వమేవ।**
**త్వన్నామ విశ్వమనుశక్తి కలం త్వదన్యత్**
**కిం నామ దైవతమిహాస్తి సమస్తమూర్తే॥ 40**

**పదవిభాగము :** షణ్ణామ్, అపి, త్వమ్, అధిదైవతమ్, అక్షరాణామ్, వర్ణత్రయోదితమను ప్రకృతిః, త్వమ్, ఏవ, త్వన్నామ, విశ్వమ్, అనుశక్తి, కలమ్, త్వదన్యత్, కిమ్, నామ, దైవతమ్, ఇహ, అస్తి, సమస్తమూర్తే.

**ప్రతిపదార్థము :** సమస్తమూర్తే=ఓ సకలరూపములలోను ప్రకాశించు దేవీ!, త్వమ్=నీవు, షణ్ణామ్=ఆఱు, అక్షరాణామ్=వర్ణములకు, అపి=కూడా, అధిదైవతమ్=అధిష్ఠానదేవతవు, త్వమేవ=నీవే, వర్ణ=అక్షరములయొక్క, త్రయః=మూడింటిచేత, ఉదిత=చెప్పబడిన, మను=మంత్రమునకు, ప్రకృతిః=మూలమైనదానివి, త్వన్నామ=నీ నామము, విశ్వమ్=ప్రపంచమును, అనుశక్తి= అనుసరించిన శక్తి, త్వదన్యత్=నీకంటె వేరైనది, కలమ్=మనోహరమైనది, ఇహ=ఈ విశ్వమున, కిం నామ=ఏమి, దైవతమ్=దేవత, అస్తి?=ఉన్నది గనుక?

**భావము :** అన్ని ప్రాణుల, వస్తువుల రూపమున ప్రకాశించు ఓ శక్తీ! నీవు ఆఱు మన్త్ర బీజములకధిష్ఠాన దైవము. మన్త్రరూపమైన మూడు బీజాక్షరములకు మూలభూతమైన ప్రకృతివి నీవే. నీనామమే యీ ప్రపంచముననుసరించియున్న మహాశక్తి. నీకంటె వేరైన మనోహరమైన, అనగా కోరికలనీడేర్చునట్టి దేవత యేమున్నది?

**విశేషములు :** వర్ణత్రయోదితమనువనగా మాయాబీజము. అనుస్వారశక్తి వ్యంజకము. కావున దానిని విడచిన త్రయము. దానికి మూలము. కావుననే ఆమె హ్రీంమతి. స్వాధిష్ఠాన చక్రమందలి ఆఱుదళముల యందలి బీజములకు అధికారిణి. లేదా శక్తిపఞ్చాక్షరీ మంత్రములు గల ఆఱు వర్ణములకు అధిష్ఠాన దేవత. లేదా అక్షరమనగా 'న క్షరతి' అను వ్యుత్పత్తిచే ముక్తి కలుగువఱకు నుండునవి గావున శరీరమందలి

షట్చక్రములు. అట్టి చక్రములకు అధిదేవత. లేదా స్వయంవరకళామంత్రమునందలి మొదటి రెండక్షరములు, తరువాత అన్ని పదములలోను అదిగా గల 'యో'కారము, సకారము, స్వాహా కలిపి అఱు. వీటికి అధిదేవత. ఇట మొదటి రెండు బీజములు, తరువాతవన్నియు సంబుద్ధిపదములు. వాటన్నింటికి నాద్యక్షరము ఒక్కటే. తరువాత భాగము సంకల్పమును తెలుపు వాక్యముగాన దాని యాద్యము-పల్లవము. వర్ణత్రయమనగా బాలా మూలము. ప్రపంచమునకే మూలమైన ఆ వర్ణములకు మూలము జగన్మాత. అనగా పరమమూలము. బాల అవిర్భవించుటకు మూలము లలిత. కావున అదికారణము. కావుననే "త్వం కారణం కారణకారణానామ్" అని భారవి మహాకవి చెప్పినట్లైనది. నామపారాయణము విశిష్టము. 'నామపారాయణప్రీత' దేవత. నామదైవతముల కభేదమే గదా. అపి శబ్దము ఇవికాక మిగిలిన యన్ని అక్షరములకును నీవే దైవమని తెలుపుచున్నది.

శ్లో॥ యా కాపి విశ్వజనమోహనదివ్యమాయా
శ్రీకామవైరివపురర్ధహరానుభావా।
ప్రాకాశ్యతే జగదధీశ్వరి సా త్వమస్మాన్
మూకాననన్యశరణాన్ పరిపాహి దీనాన్॥ 41

**పదవిభాగము :** యా, కా, అపి, విశ్వజనమోహనదివ్యమాయా, శ్రీకామవైరివపురర్ధహరానుభావా, ప్రాకాశ్యతే, జగదధీశ్వరి, సా, త్వమ్, అస్మాన్, మూకాన్, అనన్యశరణాన్, పరిపాహి, దీనాన్.

**ప్రతిపదార్థము :** జగదధీశ్వరి=ప్రపంచనాయికవైన దేవీ! కాపి=ఒకానొక యనిర్వచనీయమైన, విశ్వ=ప్రపంచమునందలి, జన=వ్యక్తులను, మోహన=మోహింపజేయుటలో, దివ్య=దేవ లోకమునందున్న, మాయా=మాయాశక్తి, శ్రీకామవైరి=దివ్యశక్తితో కూడిన శంకరుని, వపుః=శరీరమునందలి అర్ధ=సగబాలును, హరా=స్వీకరించిన, అనుభావా= అనుభూతితో కూడినట్టిదియునైన, యా=ఏశక్తి, ప్రాకాశ్యతే=వెలుగొందజేయబడుచున్నదో, సా=అట్టిశక్తివైన, త్వమ్=నీవు, మూకాన్=మూగవారమైన, అనన్యశరణాన్=మఱియొకదిక్కు లేనట్టి, దీనాన్=జాలి పడదగినస్థితిలోనున్న, అస్మాన్=మమ్ము, పరిపాహి=కాపాడుము.

**భావము :** ఓ లోకేశ్వరీ! ప్రపంచములన్నింటిని మోహింపజేయునట్టి ఒకానొక దివ్యమాయ, మన్మథుని జయించిన శంకరుని శరీరములో సగపాలైనందువలన దివ్యానుభూతి గలదానివై ప్రకాశించుచున్న నీవు మూగవారము, దీనులము, నీవుతప్ప దిక్కులేని మమ్ము కాపాడుము.

శ్లో॥ కర్త్ర్యై నమోఽస్తు జగతో నిఖిలస్య భర్త్ర్యై
హర్త్ర్యై నమోఽస్తు విధివిష్ణుహరాత్మశక్త్యై।
భుక్త్యై నమోఽస్తు భువనాభిమతప్రసూత్యై
ముక్త్యై నమోఽస్తు మునిమణ్డలదృశ్యమూర్త్యై॥ 42

**పదవిభాగము :** కర్త్ర్యై, నమః, అస్తు, జగతః, నిఖిలస్య, భర్త్ర్యై, హర్త్ర్యై, నమః, అస్తు, విధివిష్ణుహరాత్మశక్త్యై, భుక్త్యై, నమః, అస్తు, భువనాభిమతప్రసూత్యై, ముక్త్యై, నమః, అస్తు, మునిమణ్డలదృశ్యమూర్త్యై.

**ప్రతిపదార్థము :** నిఖిలస్య=సమస్తమైన, జగతః=ప్రపంచమును, కర్త్ర్యై=నిర్మాణముచేయు నీకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక, ఇట్లే, భర్త్ర్యై=ఈ విశ్వమును పరిపాలించునట్టి, హర్త్ర్యై=లయము చేయునట్టి, విధి=బ్రహ్మ, విష్ణు=మధుసూదనుడు, హర=శంకరులకు, ఆత్మ= ఆత్మవంటి సారరూపమైన, శక్త్యై=శక్తివైన నీకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక. భువన= లోకములను, అభిమత=కోరినరీతిలో, ప్రసూత్యై=నిర్మించునట్టి, భుక్త్యై=ఆత్మరూపిణివి, మూలకారణమైన బ్రహ్మరూపిణివి అయిన నీకు, నమః =నమస్కారము, అస్తు=అగుగాక, ఈ విధముగనే, ముని=ఋషుల, మణ్డల=సమూహము నందు, దృశ్య=చూడదగిన, మూర్త్యై= శరీరముగల నీకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక.

**భావము :** సమస్త విశ్వమును సృష్టించునట్టి, పోషించునట్టి, లయము చేయునట్టియు, బ్రహ్మ–విష్ణు–రుద్రుల ఆత్మస్వరూపమైన నీకు వందనము అగుగాక. అన్ని బ్రహ్మాండములను కోరిన రీతిలో నిర్మించగల బ్రహ్మరూపిణివైన నీకు నమస్కారమగుగాక, ఋషులమధ్య చూడదగిన యాకారముగల, మోక్షరూపిణివైన నీకు నమస్కారమగుగాక.

**విశేషములు :** దేవియే ఈ విశ్వమును, సృష్టించుటకు, పాలించుటకు, లయము చేయించుటకు సమర్థురాలు. ఈమె యాజ్ఞకు లోబడియే త్రిమూర్తులు వారి కార్యములను నిర్వహించు చుందురు. త్రిమూర్తులకు గల శక్తులే వాణీలక్ష్మీదుర్గలు. ఈ శక్తులు లేనిచో బ్రహ్మవిష్ణురుద్రు లెందుకును కొఱగారు. కావున ఈ శక్తులకును మూలము పరాశక్తియే. కావుననే "**అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ మేటి పెద్దమ్మ, దయాంబురాశివి గదమ్మ**" యని పోతనగారనినారు. సృష్టికార్యములచే అలసిన త్రిమూర్తులు పరాశక్తిని సమీపించి మేమీ కార్యములను చేయలేమని యనినారు. పరాశక్తి యందులకంగీకరించి ఒక పెద్ద బోషాణపు పెట్టెను తెఱచినది. అందులో వేల బ్రహ్మలు, విష్ణువులు, రుద్రులు చిన్నబొమ్మల వలెనుండిరి. వారిని త్రిమూర్తులకు చూపి మీరీ బొమ్మలవలెనుండుడు. మీ బదులు వీరిని నియమింతు నన్నది. వెంటనే త్రిమూర్తులు వారి శక్తియొక్క హద్దును తెలిసికొని "బుద్ధి బుద్ధి" యనుచు యథాపూర్వము వారి పనులు చేయుచుండిరి. ఈ గాథ కాశీకేదార ఖండమున గలదు. కావున ఈమె సృష్టిస్థితిలయములకు మూలకారణమని తేలుచున్నది. కావుననే మహాముని యిట్లు వర్ణించినారు. జగదంబయే తాను పరబ్రహ్మమని, తననుండియే ప్రకృతి పురుషాత్మకమైన జగము ఆవిర్భవించినదని, "అహం బ్రహ్మస్వరూపిణీ, మత్తః ప్రకృతిపురుషాత్మకం సర్వం జగత్, నిలయనం చానిలయనం చ" అని దేవ్యథర్వశీర్షోపనిషత్తు చెప్పుచున్నది. ఈమె త్రిమూర్తిరూపిణియని,

అనేక విశ్వములనవలీలగా సృష్టింపగలదని "అనేకకోటిబ్రహ్మాణ్డజననీ దివ్యవిగ్రహా", "గోవిన్దరూపిణీ", "బ్రహ్మాణీ", "రుద్రరూపిణీ" అను నామములు తెలియజేయుచున్నవి. భుక్త్యై అనుపదము దేవి ఆనందరూపిణి, రస స్వరూపిణియని సూచించుచున్నది. అనుభవింపబడుచున్నది. బ్రహ్మానందము, ఆస్వాదింప బడునది రసము. కావున "ఆనన్దో బ్రహ్మ", "రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీభవతి" అను శ్రుతివాక్యములిందుకు ప్రమాణములు. భావమే శక్తి. కావున శక్తి ముక్తిరూపిణి. ఈ మోక్షము మునులలోనే కనిపించును. భగవానుడు మునుల, భక్తుల హృదయములలో నుండును. అందుకే "మద్భక్తమౌని హృదయామ్భోజమధ్యమే" అనియు,

"నాహం వసామి వైకుణ్ఠే యోగినాం హృదయే న చ
మద్భక్తా యత్ర తిష్ఠన్తి తత్ర తిష్ఠామి నారద" అని పాండవగీతలోను దేవదేవుడు చెప్పియున్నాడు. అన్ని ప్రాణులలోను వేయేల చేతనములు, అచేతనములు అయిన అన్నింటను దేవుడున్నాడు. ఈ విషయమునే పోతనగారు "అనిశము సర్వభూత హృదయాంబుజవర్తియునైన యీశు" అని వర్ణించినారు. హృదయమధ్యమున గల రసస్వరూపుడైన పరమాత్మను ఆస్వాదింప వలయును. ఈ శ్లోకమున చూడుడు-

"ఉద్ఘాట్య యోగకలయా హృదయాబ్జకోశం-
ధన్యైశ్చిరాదపి యథారుచి గృహ్యమాణః
యః ప్రస్ఫురత్యవిరతం పరిపూర్ణరూపః
శ్రేయస్స మే దిశతు శాశ్వతికం ముకున్దః॥"

హృదయమందు ధ్యానింపబడుచున్న పరిపూర్ణుడైన ముకుందుడు శాశ్వతమోక్షము నొసంగవలయునని భావము. హృదయమే స్థానమని, "హృదబ్జమధ్యవిద్యుచ్ఛ్రీరేఖాత్మకే" అని పుష్పాంజలిలోను, "హృత్పద్మకర్ణికామధ్యే" అని ఆత్మారోపణమున చెప్పబడినది. కర్త్రి, భర్త్రి, హర్త్రి అను మూడును ఋకారాన్తములగుటచే "ఋన్నేభ్యో జీప్" అను సూత్రముచే జీప్ వచ్చును. మిగిలిన శక్తి మొ॥ పదములకు ఆయా ధాతువుల కంటె "స్త్రియాం క్తిన్" అని క్తిన్ ప్రత్యయము. మూర్తియనగా శరీరము. "స్త్రియాం మూర్తిస్తనుస్తనూః" అని కోశము. భుక్తి భుజ్ ధాతువు కంటె "భుజ్యత ఇతి భుక్తిః" అను అర్థమున కర్మకర్తరి ప్రయోగము. భుక్తి యనగా రసము, బ్రహ్మరూపము.

శ్లో॥ షడ్వక్త్రహస్తిముఖజుష్టపదస్య భర్తుః
ఇష్టోపగూహనసుధాప్లుతమానసస్య।
దృష్ట్వా నిపీయ వదనేన్దుమదక్షిణాక్ష్ణే
తుష్ట్యై స్థితే వితర దేవి! దయావలోకాన్॥ 43

**పదవిభాగము :** షడ్వక్త్రహస్తిముఖజుష్టపదస్య, భర్తుః, ఇష్టోపగూహనసుధాప్లుతమానసస్య, దృష్ట్వా, నిపీయ, వదనేన్దుం, అదక్షిణాక్ష్ణే, తుష్ట్యై, స్థితే, వితర, దేవి, దయావలోకాన్.

8

ప్రతిపదార్థము : షడ్వక్త్ర=ఆఱుమోములుగల కుమారస్వామి, హస్తి=ఏనుగుయొక్క ముఖ= వదనముగల అనగా వినాయకునిచే, జుష్ట=సేవింపబడిన, పదస్య=చరణములుగలవాడు, ఇష్ట=ప్రియురాలైన పార్వతీదేవియొక్క ఉపగూహన=కౌగిలింతచే, సుధా=అమృతముచే, ప్లుత= తడుపబడిన (అనగా నిండిన), మానసస్య=మనస్సుగలవాడునైన, భర్తుః=పెనిమిటి అయిన ముక్కంటియొక్క వదన=ముఖమను, ఇన్దుమ్=జాబిల్లిని, దృష్ట్వా=చూచి, నిపీయ=త్రాగి, అదక్షిణ=ఎడమ, అఙ్కే=బడిలో, తుష్ట్యా=సంతోషముతో, స్థితే=కూర్చొనియున్నట్టి, దేవి=ఓ దేవతా, దయా=జాలితో కూడిన, అవలోకాన్=చూపులను వితర=ఇమ్ము, ప్రసరింపజేయుము.

**భావము :** కుమారస్వామి, వినాయకులు శంకరుని పాదములను సేవించుదురు. అర్ధాంగియైన పార్వతి ఆనందముగా శంకరుని దగ్గఱ చేరుటచే అతని మనస్సు అమృతముతో తడిసినట్లైనది. అతని ఎడమవైపు ఒడిలో కూర్చొని, భార్యాబిడ్డలు సమీపముననుండుటచే, మనసులో కలిగిన ఆనందమే అమృతపు వెల్లువకాగా అట్టి భర్త ముఖమును చూచి ముఖములో స్పష్టముగా కనుపించుచున్న ఆనందప్రేమములను కనులతో త్రావి సంతసముతోనున్న ఈ దేవి నాపై సానుభూతితో కూడిన చూపులను ప్రసరింపజేయ వలయును.

**విశేషములు :** ఈ శ్లోకమున దేవి చక్కని సంసారముతో సుఖించుయిల్లాలిగా వర్ణింపబడినది. ఈ స్తోత్రమును పారాయణ చేయువారికి ఆనందమయమైన జీవనము, సంసారము లభించును. నిపీయ, "పీఙ్ పానే" అను ధాతువుకు వచ్చిన క్త్వాప్రత్యయమునకు ఉపసర్గ చేరినపుడు "సమాసేఽనఞ్పూర్వేక్త్వోల్యప్" అని ల్యప్ విధింపబడినది. "ప్రపీయేతి పీఙః" అని వామనుడు. "నిపీయ యస్య క్షితిరక్షిణః కథాస్తథాద్రియన్తే నబుధాస్సుధామపి" అని నైషధప్రయోగము.

శ్లో॥ యత్నాన్తరం భవితృభూతభవం మయాయత్
స్వప్నప్రజాగరసుషుప్తిషు వాఙ్మనోఽఙ్గైః
నిత్యం త్వదర్చనకలాసు సమస్తమేతత్
భక్తానుకమ్పిని! మమాస్తు తవ ప్రసాదాత్॥ **44**

**పదవిభాగము :** యత్నాన్తరం, భవితృభూతభవం, మయా, యత్, స్వప్నప్రజాగరసుషుప్తిషు, వాఙ్మనోఽఙ్గైః, నిత్యం, త్వదర్చనకలాసు, సమస్తమ్, ఏతత్, భక్తానుకమ్పిని, మమ, అస్తు, తవ, ప్రసాదాత్.

**ప్రతిపదార్థము :** భక్త=భక్తులయందు, అనుకమ్పిని=దయగలదానా! స్వప్న=కలలు, ప్రజాగర= మెలకువతో కూడిన యవస్థలు, సుషుప్తిషు=నిద్రించుటలయందు, వాక్=మాట, మనస్=హృదయము, అఙ్గైః=శరీరములతో, మయా=నాచేత, యత్=ఏ, భవితృ= జరుగబోవు, భూత= జరిగిన, భవమ్=జరుగుచున్న, యత్నాన్తరమ్=మఱియొక ప్రయత్నము

గలదో, ఏతత్=ఇది, సమస్తమ్=అంతయు, నిత్యమ్=ఎల్లప్పుడు, మమ=నాకు, తవ=నీయొక్క, ప్రసాదాత్= అనుగ్రహము వలన, త్వత్=నాయొక్క, అర్చన= పూజించుటలను, కలాసు=కళల యందు, అస్తు=ఉండుగాక.

**భావము :** భక్తులయందు దయగల ఓ దేవీ! మెలకువ, నిద్రించుట, కలలను మూడు అవస్థల యందును మనోవాక్కాయములచే నాచేత ఏ ప్రయత్నములు చేయబడునో అవి యన్నియు నీయనుగ్రహమువలన నీ పూజలను కళలయందే ఎల్లప్పుడు లగ్నమై యుండుగాక.

**విశేషములు :** "యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శమ్భో తవారాధనమ్" అని అన్నియవస్థలలోను తాను చేయు పనులన్నియు శివుని పూజించుటయే యగుగాక యని ఒక భక్తుడు ప్రార్థించినాడు. అట్లే మునియు, తాను చేయుపనులన్నియు నీ పూజలయందే యుండుగాక యని కోరినారు. సౌందర్యలహరిలో శంకరాచార్యుల వారును

**"గతిః ప్రాదక్షిణ్యక్రమణమశనాద్యాహుతివిధిః ప్రణామస్సంవేశః సుఖమఖిలమాత్మార్పణవిధా సపర్యాపర్యాయస్తవ భవతు యన్మే విలసితమ్"** అని కోరియున్నారు. పనులన్నియు తనకే 'కృష్ణార్పణమ్' అని అర్పించుమని శ్రీకృష్ణుడు గీతలో ఇట్లు నుడివినాడు.

**"యత్కరోషియదశ్నాసి, యజ్జుహోషి దదాసి యత్-యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్".**

పూజించుట ఒక కళ. చాతుర్యముతో కూడి యాచరింపబడిన యానందము నిచ్చునది కళ. పూజయట్టిదే. కావున అర్చనకళ. కావుననే అర్చనలలో వేయి పద్ధతులున్నవి. యత్నాన్తరమ్-అన్యో యత్నః అని విగ్రహము. వాఙ్మనోఽఙ్గైః-వాక్+మనస్ అన్నప్పుడు **'యరోఽను నాసికేఽనునాసికో వా'** అను సూత్రముచే అనునాసికాక్షరము వచ్చినది. మనస్+అఙ్గ అనుచోట **'ససజుషోరుః' 'హశి చ', 'అద్గుణః' 'ఏఙః పదాన్తాదతి'** అను సూత్రములను గుర్తుతెచ్చుకొనవలెను. అనుకమ్పిని- **"తచ్ఛీలతద్ధర్మతత్సాధుకారిషు"** అని ణినిప్రత్యయము. దయాగుణమే దేవి స్వభావము కావుననే,

**"అపరాధసహస్రాణి క్రియన్తేఽహర్నిశం మయా-దాసోఽయమితి మాం మత్వాక్షమస్వ పరమేశ్వరి"** అని భక్తులు ప్రార్థించి నపుడు క్షమించుచున్నది.

శ్లో॥ **స్వాహేతి సాగరసుతేతి సురాపగేతి**
**వ్యాహారరూపసుషమేతి హరిప్రియేతి।**
**నీహారశైలతనయేతి పృథక్ప్రకాశ-**
**రూపాం పరేశమహిషీం భవతీం భజామః॥ 45**

**పదవిభాగము :** స్వాహా, ఇతి, సాగరసుతా, ఇతి, సురాపగా, ఇతి, వ్యాహారరూపసుషమా, ఇతి, హరిప్రియా, ఇతి. నీహారశైలతనయా, ఇతి, పృథక్ప్రకాశరూపామ్, పరేశమహిషీమ్, భవతీమ్, భజామః

**ప్రతిపదార్థము :** స్వాహా=అగ్నిదేవుని భార్య అయిన స్వాహాదేవి, ఇతి=అని, సాగరసుతా=సముద్రుని కొమరితయయిన లక్ష్మీదేవి, ఇతి=అనియు, సురాపగా=దేవతలనది అయిన ఆకాశగంగ, ఇతి=అని, వ్యాహార=మాటలే, రూప=రూపముగాగల (ఆకారము), సుషమా=హెచ్చయిన సొగసుదనము గల కాంతయనగా సరస్వతీదేవి, ఇతి=అని, హరి=విష్ణువు యొక్క, ప్రియా=ఇష్టమైన స్త్రీ అనగా లక్ష్మీదేవి, (అనగా ఇంతకుమున్ను సాగరసుతా యని చెప్పబడిన పదము పాలసంద్రము నుండి ఆవిర్భవించిన కన్యకారూపమున నున్న లక్ష్మి, ప్రస్తుతము విష్ణువు అర్ధాంగిగా, విష్ణుమాయారూపిణియైన శక్తి, ఇతి=అని, నీహార=మంచుతో కూడిన, శైల=కొండయొక్క తనయా=కూతురైన పార్వతీదేవి, ఇతి=అని, పృథక్= వేరువేరుగా నున్న, ప్రకాశ=ప్రకాశశక్తి, రూపామ్=ఆకృతిగా గల, పరేశ=పరమశివుని యొక్క మహిషీమ్= పట్టపు రాణియైన, భవతీమ్=నిన్ను, భజామః =సేవించుచున్నాను.

**భావము :** అగ్నిదేవుని భార్యయైన స్వాహాదేవియని, లక్ష్మీదేవి ఈమెయేయని, దేవలోకము నందలి గంగాదేవియేనని, వాగ్రూపిణియైన సరస్వతి యీమెయేనని, మతికొందఱిచే పార్వతి యని కొనియాడ బడుచున్న వేరువేరుగానున్న ప్రకాశరూపము గల పరమేశ్వరుని పట్టపురాణి వైన నిన్ను సేవించుచున్నాము.

**విశేషములు :** బ్రాహ్మణులకు ముఖ్యమైనది యగ్నిహోత్రము. అట్టి అగ్నిహోత్రము ద్వారా దేవతలను సైతము వశము చేసికొనగలుగుటకు ఉపయోగపడు ప్రధానశక్తి స్వాహాదేవి. లౌకిక-అలౌకికమైన అన్ని వ్యవహారములకు నుపయోగపడునది లక్ష్మీదేవి. అన్ని పాపముల నడంచునది గంగాదేవి. మాటల రూపములోనున్న శోభయనగా వాణి. వాక్కు **పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరి**యని నాలుగు రూపములుగా విభజింపబడియుండును. వ్యాహారమనగా మనము సంభాషించుకొను శబ్దములు. పరా, పశ్యన్తి, మధ్యమలు సూక్ష్మములై, మహత్తరము లైనను సామాన్యులు, పశుపక్ష్యాదులు తమ భావమును వినబడు శబ్దముల ద్వారానే వ్యక్తము చేయును. కావున నదియందఱకు భావములను వ్యక్తపఱచుటచే శోభగలదని 'సుషమా' పదము వాడబడినది.

**"మూలాధారాత్ప్రథమముదితో యస్తు తారః పరాఖ్యః పశ్చాత్పశ్యన్త్యథ హృదయగో బుద్ధియుఙ్మధ్యమాఖ్యః వక్త్రేవైఖర్యథ"**................ సరస్వతి, లక్ష్మి, పార్వతులు ముగ్గురును ఒకే శక్తియని లోగడ వివరించుకొంటిమి. శ్రీ శఙ్కరాచార్యులవారు కనకధారాస్తుతిలో-

**గీర్దేవతేతి గరుడధ్వజసున్దరీతి-శాకమ్భరీతి శశిశేఖరవల్లభేతి।**
**సృష్టిస్థితిప్రలయకేలిషు సంస్థితాయై-తస్యై నమస్త్రిభువనైకగురోస్తరుణ్యై॥**

అని వర్ణించిరి. మూలప్రకృతియైన లక్ష్మి తననుండి కాళిని, సరస్వతిని సృష్టించినట్లు సప్తశతి. ఇది శక్త్యైకత్వమును తెలుపును. గురుపాదుకలలో ప్రకాశ-విమర్శ శక్తులను వివరించిరి. శక్తి వాచ్యముగనే వర్ణింపబడు చుండుటచే శక్తి శివాభిన్నమని తెలుపుటకే

ప్రకాశరూపాయని వాడబడినదని గ్రహింప వలయును. వ్యాహారమనగా మాట. "వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః" అని అమరము. సుషమయనగా నెక్కువ శోభ. "సుషమా పరమాశోభా" అని అమరము. సాగరసుత, హరిప్రియయను రెండుపదములకు లక్ష్మియనియే అర్థము. ఇది అర్థపునరుక్తి దోషము కాదా యనినచో కాదని సమన్వయము. ఇట్టి తతి, "ఇన్ద్రస్సహస్రనయనో౽ ప్యద్భుతరూపం పరిచ్ఛేత్తుమ్" అని యుదాహరించి ఒక పదము రూఢ్యర్థమున, రెండవది యోగార్థమున సమన్వయము చేసిన దోషము రాదని రసగంగాధరమున ప్రతిపాదింపబడినది. అట్లే ఇక్కడ సాగరసుతా పదము యౌగికము. హరిప్రియా పదము రూఢము. "కమలాశ్రీర్హరిప్రియా" అని అమరము.

**వ్యాహార :** వి, అజ్+పూర్వకమైన "హృఞ్ హరణే" యను ధాతువునకు "భావే" అను సూత్రముచే ఘఞ్ మాధుర్య, ప్రసాదగుణములు గలవు. "పృథక్పదత్వం మాధుర్యమ్" అర్థవైమల్యం ప్రసాదః" అని కావ్యాలంకారసూత్రములు.

**శ్లో॥** హారస్ఫురత్కుచగిరే హరజీవనాథే
హారిస్వరూపిణి హరిప్రముఖాభివన్ద్యే।
హేరమ్బశక్తిధరనన్దిని హేమవర్ణే
హే చణ్డి హైమవతి దేవి నమో నమస్తే॥ **46**

**పదవిభాగము :** హారస్ఫురత్కుచగిరే, హరజీవనాథే, హారిస్వరూపిణి, హరిప్రముఖాభివన్ద్యే, హేరమ్బశక్తి ధరనన్దిని, హేమవర్ణే, హే, చణ్డి, హైమవతి, దేవి, నమః, నమః, తే.

**ప్రతిపదార్థము :** హే=ఓ, హార=ముత్యాలదండచే, స్ఫురత్=వెలుగొందుచున్న, కుచ= స్తనములను, గిరే=కొండలుగల, హర=శంకరుని, జీవ=ప్రాణములకు, నాథే=అధిపతివి, హారి=అందఱిని ఆకర్షించు, స్వరూపిణి=స్వరూపముగల, హరి=విష్ణువు, ప్రముఖ=మొదలైన వారిచే, అభివన్ద్యే=కొనియాడదగినట్టి, హేరమ్బ=గణపతి, శక్తిధరః=కుమార స్వాములను నన్దిని=ఆనందపెట్టునట్టి, హేమ=బంగారము యొక్క వర్ణే=కాంతివంటి కాంతిగలట్టి, చణ్డి= చండీదేవతవైన, హైమవతి=ఓ పార్వతీ, దేవీ=దేవీ, తే=నీకు, నమః=నమస్కారము, నమః=మఱల నమస్కారము.

**భావము :** ముత్యాలదండలచే ప్రకాశించు వక్షస్థలము గలిగి, శంకరుని ప్రాణేశ్వరివై ఆకర్షించు చున్నదానివై, విష్ణ్వాదిదేవతల చేతను నమస్కరింపబడుచున్న దానివై, వినాయకుడు, కుమారస్వాములకు తల్లివై వారిని సంతోషపెట్టుచున్న దానివై, బంగారు రంగుతో ప్రకాశించు చున్నదానివైన చండి, హైమవతివైన ఓ దేవతా నీకు మఱల మఱల నమస్కారము.

**విశేషములు :** హకారము శివవాచకమని, రంబమనగా ధ్వనియని, కావున శైవతన్త్ర ప్రవర్తకుడని గణపతి సహస్రము. అన్నింటిని కాలస్వరూపుడై లయముచేయు హరుని

ప్రాణములకధిపతివై యున్నావని, అందఱిని తన మాయాశక్తిచే నాకర్షించు విష్ణువు చేతనే ఆకర్షణము యొక్క ఆధిక్యముచే కొనియాడబడుచున్నావని వర్ణించుటచే దేవి మహిమ వ్యక్తమగుచున్నది. "కామేశ్వర ప్రాణనాడీ" అని లలితాసహస్రము. హకార-రేఫ-నకారావృత్తులతో అనుప్రాసాలంకారము.

శ్లో॥ యే తు స్వయంవరమహాస్తవమన్త్రమేతం
ప్రాతర్నరాస్సకలసిద్ధికరం జపన్తి।
భూతిప్రభావజనరఞ్జనకీర్తిసౌన్ద
ర్యారోగ్యమాయురపి దీర్ఘమమీ లభన్తే॥ 47

**పదవిభాగము :** యే, తు, స్వయంవరమహాస్తవమన్త్రమ్, ఏతమ్, ప్రాతః, నరాః, సకలసిద్ధికరమ్, జపన్తి, భూతిప్రభావజనరఞ్జనకీర్తిసౌన్దర్యారోగ్యమ్, ఆయుః, అపి, దీర్ఘమ్, అమీ, లభన్తే.

**ప్రతిపదార్థము :** యే=ఏ, నరాః=మానవులు, తు=అయితే, ప్రాతః=ఉదయకాలమున, ఏతం=ఈ, సకల=సమస్తమైన, సిద్ధి=ఫలములను, కరమ్=కలిగించునట్టి, స్వయంవర=స్వయంవరమనుపేరుగల, మహాస్తవమ్=గొప్పస్తోత్రమును, జపన్తి=జపించుచున్నారో! అనగా పారాయణము చేయుచున్నారో, అమీ=అట్టివీరు, భూతి=సంపద, ప్రభావ=సామర్థ్యము, జన=ప్రజలను, రఞ్జన=అనురక్తులను చేయుట, కీర్తి=గొప్పఖ్యాతి, సౌన్దర్య=అందము, ఆరోగ్య= శరీరమున, మనస్సున బాధలేకుండుటను, అపి=ఇంకను, దీర్ఘమ్=ఎక్కువ, ఆయుః= జీవన పరిమాణమును, లభన్తే=పొందుదురు.

**భావము :** ఏ మానవులు అన్ని ఫలములనొసగునట్టి స్వయంవరకళా దేవతయొక్క గొప్ప స్తోత్రమను నీ మంత్రము స్నానము చేసి శుచిగా ఉదయమున పఠింతురో, వారు సంపదను, శక్తిని, ప్రజారంజనమును, పేరును, అందమును, ఆరోగ్యమును ఇంకను దీర్ఘాయువును పొందుచున్నారు.

**విశేషములు :** అన్ని సిద్ధులను పొందుదురనగా ఆ ఫలములేమో తరువాత క్రమముగా చెప్పబడినవి. లోకమున కావలసిన ఫలితములన్నియు నివే. ఇవి కానివి ఇకవేరే లేవు. చిన్న చిన్న ఫలములన్నియు ప్రధానములైన వీటిలోనే చేరును. ఈ స్తోత్రమే మంత్రము వంటిది. కావుననే జపించుచున్నారని చెప్పబడినది. స్తోత్రముతోనే మంత్రమును జపించినట్లగును. ఇది మన్త్రమాతృకాస్తవము. మన్త్రమందలి యక్షరములతో స్తోత్రము శ్రీ దుర్వాసోమునులచే రచింపబడినది. కావున చాలా శక్తిగలది. స్వయంవరకళాదేవత ధ్యానము మంత్రమహోదధిలో ఈ విధముగా ఉన్నది.

"శమ్భుం జగన్మోహనరూపపూర్ణం
విలోక్య లజ్జాకులితాం స్మితాఢ్యామ్।

మధూకమాలాం స్వసఖీకరాభ్యాం
సంబిభ్రతీమద్రిసుతాం భజేఽహమ్॥"

భూతిప్రభావజనరఞ్జనకీర్తి సౌన్దర్యారోగ్యమ్ అనునపుడు సమాహార ద్వన్ద్వము. సమాహారమేకము గావున ఏకవచనము. "స నపుంసకమ్" అని నపుంసకము.

శ్లో॥ శతక్రతుప్రభృత్యమర్త్యతత్యభిప్రణత్యుప-
క్రమప్రసృత్వరస్మితప్రభాఞ్చితాస్యపఙ్కజే।
హరప్రియే వరప్రదే ధరాధరేన్ద్రకన్యకే
హరిద్రయా సమన్వితే దరిద్రతాం హర ద్రుతమ్॥ 48

**పదవిభాగము :** శతక్రతుప్రభృత్యమర్త్యతత్యభిప్రణత్యుపక్రమప్రసృత్వరస్మితప్రభాఞ్చితాస్యపఙ్కజే, హరప్రియే, వరప్రదే, ధరాధరేన్ద్రకన్యకే, హరిద్రయా, సమన్వితే, దరిద్రతామ్, హర, ద్రుతమ్.

**ప్రతిపదార్థము :** శతక్రతు=ఇంద్రుడు, ప్రభృతి=మొదలుగా గల, అమర్త్య=దేవతల, తతి= సమూహము యొక్క, అభిప్రణతి=సంపూర్ణముగా దేవతను అనుకూలముగా చేసికొనుటకై చేయు సాష్టాంగ నమస్కారముల, ఉపక్రమ=ప్రారంభములందు, ప్రసృత్వర=బాగుగా నలువైపులకు వ్యాపించుచున్న, స్మిత=చిఱునవ్వుల, ప్రభా=కాంతిచే, అఞ్చిత= ఒప్పారుచున్న, ఆస్య=ముఖమనెడి, పఙ్కజే=కమలము గలిగిన, హర=శంకరుని, ప్రియే=ప్రియురాలవైన, వరప్రదే=కోరికలను ఇచ్చునట్టియు, హరిద్రయా=పసుపుతో, సమన్వితే=కూడినదానివైన, ధరాధర= పర్వతములకు, ఇన్ద్ర=ప్రభువైన హిమవంతునియొక్క కన్యకే=కుమార్తెవైన ఓ దేవతా, దరిద్రతామ్=పేదఱికమును, ద్రుతమ్=వెంటనే, హర=పోగొట్టుము.

**భావము :** ఇంద్రుడు మొదలైన దేవతల సమూహము నీకు సంపూర్ణభావముతో నమస్కరించుటకు ప్రారంభించగనే వారియందు నీకుగల అనుగ్రహమును సూచించు చిఱునగవుల వెలుగులు పద్మమువంటి నీ ముఖమునందు వ్యాపించియుండును. శంకరుని భార్యవైన, వరములనిచ్చునట్టి, మంగళకరమైన పసుపుతో కూడి ప్రకాశించుచున్నట్టి ఓ పార్వతీ! భక్తుల పేదఱికమును వెంటనే పోగొట్టుము.

**విశేషములు :** దేవతలలో ఇంద్రుడు గొప్పవాడు. అధిపతి కావున ఇంద్రుడు మొదలుగా గల దేవతలని చెప్పినారు. అధిపతియే సాష్టాంగపడినపుడు అతనిననుసరించు ఇతర దేవతలును నమస్కరింతురు. అంతేగాక ఇంద్రుడు శ్రీచక్రోపాసకుడు. లలితాదేవిభక్తుడు కావున అతనికి ప్రాముఖ్యమివ్వబడినది. వారు నమస్కరించుటకు పూనుకొనగనే నీ యనుగ్రహము చిఱునగవు ద్వారా వ్యక్తమగుననుటచే దేవత సుకుమార హృదయము గలది, దయామయియని సూచితము. శంకరునికి ఇష్టురాలై యానందముతో నున్నను భక్తులకు వరములనిచ్చుట మఱువదని సూచితము. పసుపుతో కూడియుండుట యనగా

భక్తులు ఈమెను పసుపుతో పూజింతురు. కావున ఈమె సౌభాగ్యమునిచ్చునని సూచితము. కావుననే మంగళగౌరి. పేదటికమును పోగొట్టుట యనగా ఎవనికి ఏది లేదో ఆ విషయమున నాతనికి పేదటికము. అట్టి లేమిని పోగొట్టి కోరినదానిని యిమ్మని ప్రార్థనము. మొదటిపాదమున యణాదేశములచే యకారము అనుప్రాస. ఒకటిరెండు పాదముల లోనే గాక మొత్తము మీద రేఫలు అవృత్తినొందినవి. నాల్గవపాదమున సంయుక్తాక్షరమైన "ద్ర" అను అక్షరము అవృత్తము. మొత్తముమీద అనుప్రాసాలంకారము సమృద్ధిగా వాడబడినది. క్ర, త్య, ద్ర అను సంయుక్తాక్షరములు అనుప్రాసగా వాడబడినవి. వరివస్యా రహస్యమను మంత్రశాస్త్ర గ్రంథమున శ్రీ భాస్కరరాయలు వారనుప్రాసను వాడిన విధము చూడుడు :

"వస్తుప్రస్తుతమస్తు నిస్తులమహస్తోమాస్తితావాస్తు, నో
హస్తన్యస్తసమస్తపుస్తకభరం ధ్వస్తాస్తదేనస్తతి।
శస్తస్వస్తికృదస్తదుస్తరతమస్స్వస్తోకసౌవస్తికమ్
గీస్తోయస్తనయిత్ను సుస్తనయుగం వాస్తోష్పతిప్రస్తుతమ్"

పై స్తోత్రశ్లోకమైన 'శతక్రతు' అనుచోట భిన్నమైన సంయుక్తాక్షరముల యనుప్రాస కాగా ఈ శ్లోకమున ఒకేరకమైన సంయుక్తాక్షరము యనుప్రాసగా వాడబడుట విశేషము. జగజ్జనని పసుపుచే నలంకరింపబడియుండును గావుననే "హరిద్రాకుఙ్కుమాదిగ్ధా" అని వేదవ్యాసమహర్షిచే లలితాత్రిశతిలో వర్ణింపబడినది. న్యాయముగా పరబ్రహ్మము నిర్గుణమే అయినను ఉపాసన కొఱకు సగుణముగా చెప్పబడినది. భక్తులననుగ్రహించుటకే పరదేవత ఒక రూపమును ధరించునని "భక్తానుగ్రహకారక విగ్రహవత్తాం వినా దేవతాయాబుద్ధావ-నారోపేణ అనుపపద్యమానం స్యాత్ స్వతఃప్రమాణ వేదవాక్యవశాద్బాధకాభావే విగ్రహవన్తః అఙ్గీకర్తవ్యా ఇతి సూత్రభాష్యకారాభ్యాం ప్రతిష్ఠాపితమ్" అని త్రిశతీభాష్యమున శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు చెప్పియున్నారు. శ్రీ స్వయంవరకళాదేవత భక్తులనుగ్రహించుగావుత.

ఆంధ్రవ్యాఖ్యానము సమాప్తము.

శ్రీః

శ్రీశ్రీశ్రీ స్వామి అరుళానందసరస్వతివారి
సంపాదకత్వములో వెలువడుతున్న
"ఆత్మజ్యోతి" లో ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణములతో
ధారావాహికగా ప్రచురింపబడిన ఈ "స్వయంవరకళాస్తోత్రమ్"
సాహితీ మిత్రుడు
శ్రీ రావి మోహనరావు గారి ప్రేరణతో
రూపుదిద్దుకొన్నది.

– డా॥ నిష్ఠల సుబ్రహ్మణ్యం

54




శ్రీశ్రీశ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతిస్వామివారు

56



శ్రీశ్రీశ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతిస్వామివారు

## శ్రీశ్రీశ్రీ స్వామి అరుళానందసరస్వతివారి

సంపాదకత్వములో వెలువడుతున్న
"ఆత్మజ్యోతి" లో ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణములతో
ధారావాహికగా ప్రచురింపబడిన ఈ "స్వయంవరకళాస్తోత్రమ్"
నేడు పుస్తకరూపముగా ముద్రింపబడినది.